# నవనాథము

[గద్యకావ్యము]

రచయిత :

ఉభయభాషాప్రవీణ

కొత్త సత్యనారాయణచౌదరి

# ప్రస్తావన

శ్రీనాథునకు సమకాలికుఁడగు 'గౌరన' మహాకవి వ్రాసిన తెలుఁగు కావ్యములలో నవనాథ చరిత్ర మొకటి. 'ద్విపద కావ్యంబు ముదిలంజ దిడ్డిగంత'.... ఇట్టుల లోక మున ద్విపదకు అనాదృతి యుండుటఁ జేసియో- ఈ కావ్యము కేవలము శైవమతమువారి ఉత్సాహప్రోత్సాహములమూల మున వెలయుటఁ బట్టియో తెలుఁగున నంతగా నిన్న మొన్నఁటి దాఁక- ఇది ప్రచురప్రచారమునకు రా లేదు. తెలుఁగులో ఈ పేరు కల వచన రచన మఱొకటి కలదు. అది వైష్ణవ సిద్ధులగు నవనాథులను వర్ణించిన గ్రంథము. మహారాష్ట్ర భాషలో మాలూపండితుఁడు వ్రాసిన దానిని శ్రీ బచ్చు రామన్న గుప్త యనువారు తెలుఁగు వచనము నకుఁ దెచ్చిరి. ఈ రెండింటఁ గల సిద్ధనాథుల చేఁతలలోఁ గొన్నింటఁ బరస్పర సంవాదము కలదు. కాని, గౌరన కావ్యము శైవ గాథా ప్రతిపాదకము; రెండవది వైష్ణవ గాథాభి వర్ణితము.

ఈ రెండింటిని బరిశీలించి కేవలము కవితా ధోరణియే గాక గాథలలోని వైచిత్ర్యము మిక్కిలి ఆకర్షణీయము కాఁగా గౌరన కావ్యమును గద్యముగ వ్రాసి యీ పేరునఁ బ్రక టించితిని.

గౌరన కావ్యములో సమయోచితముగ రసానుకూలముగ సరసములగు వర్ణనా ఘట్టములు పెక్కులు కలవు. శైవ కవుల వాఙ్మయమున ప్రచురప్రచార మందిన పద ప్రయోగములు కాన నగును. అప్పటి దేశీయ పరిస్థితులు జాతీయ ధర్మములును గొన్ని అభివర్ణితములై యున్నవి. అన్నింట ప్రౌఢ మగు నీకావ్యమును ప్రౌఢ రచనలో నాకుఁ దోఁచిన రీతిని గద్యము కావించితిని. కొన్ని ఘట్టములలో గౌరన కవివర్యుని ముద్దులు కురిపించు పదములనె ఒద్దికకు లోపము రానీయక నా మాటలకు మెఱుఁగుగ నెఱవు తెచ్చుకొని యుంటిని. కొన్ని పట్టుల ద్విపద భాగములోఁ గొన్ని పంక్తులు అచ్చునకు రాక అన్వయము సరిపోక వీరశైవుల పారిభాషిక పదములతో వేదాంతపు తికమకలతో మిక్కిలిగా విసువు కలిగించినవి. అట్టి పట్టుల ప్రత్యక్షరము వచనములో వచ్చుటకు వీలు పొసఁగకున్నను కథా తంతువు తెగనీయక విషయ మనుస్యూత మగు నట్లులు యథాశక్తిని విశద పఱిచితిని. ఈ నా కృషికి విద్యాధికారులయు నుపాధ్యాయ సోదరులయు చేయూఁత నర్థింతును.

సత్యనారాయణ చౌదరి

అనుక్రమణి                                        పుట

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

# విఘ్ననాథుని జన్మము



సర్వజగత్ప్రసిద్ధము నయనానంద సంధాయకమునగు కైలాసనగమ్మునఁ బ్రమథగణము పరివేష్టించి యుండఁ బరమయోగీంద్రులు చుట్టుపట్టుల బలిసియుండఁ జింతామణీ భద్రపీఠమునఁ జంద్రశేఖరుఁ డొకప్పుడు సభ తీరిచి యుండెను. నారదుని వీణానినాదము వీనుల విందయ్యెను. అప్సరోంగనల యాటపాటలు కన్నుల పండువయ్యె. గరుడ గంధర్వ కిన్నర కింపురుషాదులు భక్తి ప్రపత్తులతోఁ బార్వతీపరమేశ్వరుల సేవఁ జూపు లోలయఁ గొలిచి యుండిరి.

అవ్వేళ ఋతురాజ మెల్లయెడలఁ గలయం బర్వి విరహుల జంటకు మంటయై కోయిల గములకుఁ బంటయయి రసికుల మొక్కుల కిక్కయయి పూవుల ప్రోవుల తేనెసోనలు జాలువాఱుచు ముక్కంటిఁ గొల్వను వచ్చెనో యన మురిపము చూపఁజొచ్చెను. గాలికిఁ దూలి కారాకు లందందఁ గడువడి రాల సాగెను. క్రొమ్మోసు లొదవి యిగురులుఁ జిగురులు సొంపెసలారఁ గొమ్మలు రెమ్మలు క్రొంగ్రొత్త తళుకు లీనుచుండెను. కోయిల జంట లే మావి కొమ్మల నిమ్ముగఁ జేరి ముక్కులు ఱెక్కలు మురువుగాఁ దీరిచి చొక్కి యరగన్ను వెట్టి తమకములు నెరయ మధురముగఁ బంచమశ్రుతిఁ బిసాళించెను. బొండు మల్లియల దండఁ జేరి సుధారసం బానియాని యేపగు కైపున హోరాళముగ మొరయు

తుమ్మెదపిండు ముల్లోకము లొక్కుమ్మడిని గెలువఁ దివురు మరుని బలఁగము విజయశంఖము లొత్తి నటులు వింతవింత లగు మ్రోతలు సంతరించెను.

అత్తఱి నీలకంధరుఁడా వెండికొండపయి వనకేళి సలుప మదిఁ గోరి కొండరాచూలికిఁ గనుసన్న సేయ, నది యెఱిఁగి యండలి వారా కాలకంధరుని యానతి గైకొని కొలువు చాలించిరి. ఉమామహేశులు ప్రమోదమానసులయి యుద్యానవన మొందు సొచ్చి వలపులు గుమ్మరించు సొలుపగు చేఁతలతో నర్మగర్భంబులగు పలుకుల కులుకులతో వాహ్యాళి యొనర్చి యొయ్యారములు సూపి కమ్మని తావులు గుమగుమ లాడు నమ్మహీరుహముల పొంత సేద దీఱి జలకేళి కయి దీర్ఘికలోఁ జేరిరి. అందుఁ గలహంస బృందమ్ముల ఱెక్కల గాలిని గదలు తమ్ములలోఁ దొరఁగిన పుప్పొళ్ళ తావులను మెచ్చు కొంచుఁ జల్లులాడి హల్లకములతో నొండొరులు వేఁటలాడి యలసి సొలసి జలములఁ బాసి, నదీసైకతముల నాసీను లయిరి.

అంత ననంత భక్తి పారవశ్యమ్మునఁ బార్వతి పరమేశ్వరునకు జోహారువు సల్పి సొలుపగు పలువరుస రుచు లరుణాధరంబుపై నల్లనఁ జిందులు ద్రొక్క, స్వామీ నాపయిని దయామృతము వోసి యధ్యాత్మవిద్య నెఱిఁగింపవే భవరోగ వైద్య యంచు నర్థించెను. వల్లెయని యీశ్వరుండు నెల్ల జీవుల దశావిశేషములను జతుర్ముఖయోగములను నభ్యాస విధానములను సౌఖ్యపరంపరలను సిద్ధిహేతుకములను బరకాయ సంస్థితులను వేఱువేఱ నేరుపు మీఱ నన్నియు నెఱిఁగించెను.

వీనులకు విందగునటులు రాజయోగము వినిపించెను. తదా నంద రస మగ్నయై యద్రిరాజ నందన యొడలు మఱచి ముం దటివలె మాట విని యూఁకొన నేరక యూరకున్న, నత్తఱి నా మాటకు నీటిలో నొక్కఁడ నెవ్వరో యూఁకొనుట పర మేశ్వరుఁ డూహించెను చూతమని యప్పైకథావిధాన మాపి పలుకకున్న పరమేశ్వరుని స్వామీ, సర్వము నానతి యిచ్చి నన్నుఁ గృతార్థుఁ గావింపవా యని పలుకొక్కఁడు చెవులఁ బడెను. నీటిలో డాగి పలికినవాఁడెవ్వఁడవు, నీవిట కరుదెంచి యంతయు వినుపింపుమా యని యాదరంబున మహాదేవుండు పలికెను.

అప్పుడు కుందనముఁ బోలు నందమగు మేను మెఱుఁగుఁ గులుకని కెంజడ లొలయ లావణ్యము చిందు వదనారవింద మొప్పు లొలుక నాజానుబాహువులు నన్నువ లేఁగౌను వెడఁద యురంబును రాజిల్లఁ జెవులదనుకఁ గదిసిన వాలారు కన్నుల చెన్ను చిప్పిలి పొంపిరివోవ నాత్మీయ తేజము నలుదెసల నుల్లసిల్ల నుత్తమ పురుషుం డొక్కండు నీటిలో వెడలి భూతేశు దరిఁ జేరెను. ఉల్లములు పల్లవింప నెల్లసుర లెల్లయెడలఁ బూలవానలు కురిసిరి. దేవదుందు భులు మ్రోయించిరి. మెల్లనై చల్లనయి పిల్లతెమ్మెరలు మెలంగెను. గంధర్వు లుత్సహించి పాటలు పాడిరి. అచ్చ రలు వేడుకతో నాటలు నాడిరి. కల్యాణమూర్తులగు నా యాది దంపతులకు జైవారము సేయుచు సుస్థిర భక్తితో మ్రొక్కులు పెక్కులు కావించుచు నా మహాపురుషుఁ

డత్యంత వినయమునఁ గేలుదోయొత్తి యాదలఁ గేలు కొలిపి యెదుగు వాటుగ నిలిచి యుండెను.

ఆదిదంపతులు దీర్ఘికలో డిగ్గి జలకేళి సలుపుతఱిని దోయంబులోపలఁ దొరఁగిన రేతంబు నొక మీనము చయ్యన మ్రింగుడు నద్దాన మీననందనుఁ డయి యాతండు యోగ విద్యా విధంబు వినుచుండి యప్పుడు నీటిలో వెడలి వచ్చుట యా యుమయు నెఱింగి యాలంతి నవ్వోలయఁ దియ్యము నెయ్యముం దలిర్పఁ బల్కులు నా యనుంగు పుత్త్రు నక్కునం జేర్చి తీపారఁ జూపుల నేపారఁ బ్రిదుఁ మద్దనుని బ్రేకవఁ బఱపెను. ఆతఁడు తద్భావంబు తెలిసి సూనునిం జూచి యేమిట వరములు వలయునో యడుగుమని నుడివెను. మీననందనుఁ డొయ్యన దరిఁ జేరి యయ్యా, యమ్మకపుడు తా మానతిచ్చు యోగమాహాత్మ్య మంతయు వినియుంటిని. శేషంబు సర్వంబు నా కానతి యిచ్చి నన్ను మన్నించుటయే నా కోరిన వరంబని విన్నవించెను. పరమేశ్వరుఁ డద్దాని కనుమతించి యోగవిద్యా రహస్యము గర్భస్థున కొసంగరాదనియు నిఁక మీఁదట సర్వము వినుపింతు ననియుఁ బల్కి కుమారుని సిద్ధాసనంబున నునిచి యాతని యాదలఁ గేల్లనఁ గదియంగఁ గేలు కొలిపి సర్వంబు గఱపెను. అట్టులు సర్వ యోగంబులు నభ్యాస విధానంబులు నేరిచి సకలవాదంబుల్లు నిఖిల సన్మ్రణులు నెల్ల మంత్రంబులు గుఱుతించి యా కుమారుఁడు భక్తిపారవశ్యమ్మున గ్రుక్కిళ్లు మ్రింగుచుండెను. వెండియు సకలౌషధములు సకల సంసిద్ధియు నమరిన నీశుఁ డతనికిఁ బ్రసాదించి నిష్కలంకచరిత్ర,

సిద్ధగణంబుల కెల్ల గురుండవై నలుగడల నీ కీరితి యువ్వారిగ నివ్వటిల్ల మీననాథుం డను నామధేయమున నెల్ల యెడల గ్రుమ్మరుచు సర్వతీర్థములు సేవించుచు నదీనదములఁ గ్రుంకు లిడుచుఁ గొండలలోఁ గోనలలోఁ దిరుగాడుచుఁ దాపసుల యాశ్రమములను జొచ్చుచుఁ జల్లని యేలుబడిచే నెల్లవేళల నానందించుచు దేశములలోఁ గొండ గుహలందు వాసము కావించుచు యోగాభ్యాస మార్గంబు నేనాఁడు విడనాడక పొమ్మని ప్రేమంబునఁ బలికి తానును పార్వతియుఁ గలధౌత శైలంబున కరిగెను.

## మీననాథుని దేశాటనము

ఆమీఁదటఁ గలియుగ మరుగఁ దేఁ యుగసామర్థ్య మాత్యంతము తప్పించెను. జడత్వ మంతట నేర్పడియె. మేనుల జనసత్త్వంబు లంతు లాయెను. ఆశ్రమ ధర్మంబు లల్పాల్పంబు లయ్యె. ఆచారము లయ్యెవి యలుపాలఁ బడి యెను. అట్టి కలికాలంబున యోగాబ్ధి చంద్రుం డగు మీన నాథుండు నాథముఖ్యుం డయి విశ్వనాథు శాసనం బది మదిని గుదుఱుపఱిచి దేశ మంతయుఁ దిఱుగఁ జొచ్చెను. కాళింగ బంగాళ కరహాటములు గౌళ కేరళ చోళ కర్ణాట ములు కురుకుదు కొంకణ పౌండ్ర కోసలములు నివి యవి యన నేల యెల్లదేశములు సర్వసాగరములు నన్ని దీవులు నఖిల పురంబులు సకలతీర్థంబులు కొండలు కోనలు కోవెలలు తిరిగి తిరిగి తుది కమ్మహాయోగి మాళవదేశంబు చేరెను.

అందెవ్వఁడు నెవ్వరు వఱపువలని కఱవును వైరులవలని వెఱ
పును మందునక్కైనను బొంది యెఱుంగరు. ఆధివ్యాధు లన్న
మాటయె బోధపడదు. ప్రజలెల్లరు పరమానందంబునఁ
బాడిపంటల నోలలాడుచు బహుళ సంపదలఁ దులఁ
దూఁగుచుఁ జల్లని యేలుబడిలో నెల్లవేళల హాయి చెలంగి
మెలంగుచుండిరి. ఆదేశంబు నేలు నేలిక రాజమహేంద్ర
నరేంద్రుఁడు ఆతనిం బోలు ఱేండ్లు భువిలో నెవరు లేరు.
తేజంబునఁ గాంతిని దేఁకువను రాజసంబున రాణ వహించిన
యా రాజు రారాజయి మహావైభవోపేతుఁడయి మాం
ధాతపురంబు రాజధానియై చెలంగ మహాప్రాభవంబునఁ బరి
పాలించుచుండెను. పురోప కంఠమం దంచల చాలు క్రీడించు
చెంగల్వ కొలంకుల చెన్ను నెన్నఁ బన్నగపతియు నేరఁడు.
ప్రమదావనంబులలోని చిలుకల పలుకులు మురిపములు
కులుకుచుండును. పట్టణ ప్రాకారములు కోటలు నట్టిల్లు
కొలువు కూటములు నిట్టివి యట్టివన నెవ్వరి తరమగును?
హాటక కల్పితంబులగు నాటకశాలలు ముత్యాల చూరుమొన
లొప్పు గుత్తంపుఁ జవికలు కొంగ్రొత్తదనము హత్తియుండు
చిత్తరువుల వరుసలు చిద్విలాసము చిప్పిలు శివమందిరంబుల
శ్రేణులు వివిధవస్తువులు పచరించుటను విన్నాణ మందిన విప
ణులు నద్దములు వోలె స్నిగ్ధము లయి పరి దిద్దిన మెఱుగారు
వీధులు పట్టు పడగల ప్రభలఁ బలుదెఱంగులఁ గ్రాలు రత్నాల
తోరణంబులు పేరొందిన తేరులు తిన్నని తేజీలు మత్తిల్లిన
మాతంగములు రాజులు రౌతులు రసికులు భటులు భోగులు

త్యాగులు పొలుపారు నా మహాపత్తనమ్మును కనులార నా మహాయోగి తిలకించి లెస్సగ భావించి యందందుఁ జరియించి యటఁ గుఱంగట నర్మదలో స్నాన మాచరించెను. పదపడి కురువక పాటల కుంద బృందంబుల స్తబక సారంబులఁ గాపురం బున్న తేటిగముల తియ్యని ఝుంకారముల నలరియున్న యోంకార తీర్థ మెుయ్యన వీక్షించి భక్తిప్రపత్తుల నోంకార దేవు మఱద మారఁ బూజించి మ్రొక్కి కొన్నాళ్లు కేవలఁ బ్రొద్దులు పుచ్చి నగరప్రాంత కాంతారమున నొక్కయెడ నొక్క కొండ కోనలో నెలవుగా నిలిచి యోగవిద్యా పరి శ్రమము మిక్కిలిగఁ బచరింపసాగెను. ఒక్కొక్క తఱిని వేఱొక్క వేషంబు పూని యాలమందలలోనికిఁ జెచ్చెర విచ్చేసి దగ్ధమ్ములు గ్రోలి వచ్చుచు నెవ్వారికిఁ దన గుఱు తులు కనరాని తీరునఁ బొనుపడి యుండెను.

## గొల్లని కథ

ఇట్లు లుండ నట్టియెడ నొక్కనాఁడు గోపకులతో నాట పాటలు సలుపుచుఁ గసువు మేసెడి పసులవెంట నంటి తిరుగా డుచు గొల్లఁ డొక్కండు విల్లు కేలఁ బూని యాదలఁ బీలి పాగ కదలుచుండ మొలను బిల్లనగ్రోవి యూఁగుచుండ మూఁపున గొడ్డలియు మునుఁగిడ్డ గొంగడియుఁ గుత్తుకను గురిజపూసల గుత్తులును వెదుఱుఁగోలయుఁ గాసె దట్టియుఁ జెంప వ్రేలాడు జంపులును వాకట్టు బదనికెలు కుడిరొండి నొరపుగాఁ గ్రుక్కి యుంచిన చూడుఁగొడుపును నునుజింక

కొమ్ము జల్లి చిక్కంబు నొక్క మొగి నాతని వైఖరి వక్కాణింప వచ్చేసి యాఁ గుహాంతరము తొంగి చూచెను.

అటఁ జందుకుని చల్లని కాంతి తళుకొత్తు పలుచని యొడలు, నాదెసకుఁ బొలయక యట్టె-యున్న చూపులు, మట్టు మడఁగి యేకాగ్రమై నిలిచిన చిత్తము ఫాలభాగమునఁ బొలుచు త్రిపుండ్రంపు రేఖలు ప్రభూతంబగు విభూతి పూఁత నిగనిగలాడు దంతపు లాతాము శోలుపారు స్ఫటికపుఁ బూసల పేరులు చిఱుత కెంజెడలు సింగినాదంబు నొక వింత కాంతు లీనఁ దొడలపయిఁ జేతు లొత్తుగ నూఁది నెన్నడుము నిక్కించి మొగమెత్తి యోగసమాధిని గూరుచున్న మీననాథుఁడు కానుపించెను. గొల్లం డా దృశ్యంబునకు నుల్లంబు పల్లవింపఁ దద్దయు నబ్బురం బంది లోలోన వెఱచుచు డాయం బోయి యాతని యోగ విశేషంబు తెలియంగని యెఱుంగక భక్తి ప్రపత్తుల నిజమస్తక మవ్వాని పాదపద్మములఁ జేర్చెను. తదీయాంగ సంస్పర్శమున యోగసమాధి చెదరి కలువలనుండి వెలువడు తేటిగముల పోలిక చూపు లొలయఁ గేలుదోయి మొగిచి మిక్కిలి భక్తితో మ్రొక్కుచు మ్రోల నున్న గోపాలు నల్లనఁ బొడఁగని కొదలేని కరుణ నెంపొదవ నెక్కడివాఁడవోయి, నీవిక్కటికి వచ్చితివి. ఈ గుహాలోపల నెట్టులు చొచ్చితివి. నామీఁద భక్తి కుదురుటకు నిమిత్త మేయది యని యాతనిఁ బ్రశ్నించెను. అంత ననంత సంతోష తరంగి తాంతరంగుఁ డయి వినయ వినమిత గాత్రుండగు నా గొల్లండు, స్వామీ రాజనరేంద్ర

భూతలేంద్రుని వేల కొలంది యాలమందల కెల్ల నధికారిని నేను. సకల గోపాలకులు నాయాన సంచరింతురు. నేఁడు నాపాలి భాగ్యరాశి నాఁ బొలుపారు స్వాముల పాదకమలములు గంటిని. కృప కల చూపులు మీఁదఁ బొలయించి నన్నుఁ గడ తేర్పుఁ డని విన్నవించెను. అది విని మీననాథుఁ డోయీ, పసులఁ గాపాడుట పరమ పుణ్యంబు తొల్లి గొల్లండయి వాసుదేవుండు పసులను గాచెఁగాదె! గోవులను గాచు తెఱంగులు గొన్ని చెప్పుమా విందమని పలికెను. గొల్లఁ డానందపడి యాతనికి నింకొక్క మఱి మ్రొక్కి నిలిచి యిటు లనియెను.

స్వామీ, తొలి కోడి కూయు ప్రొద్దున గోపాలురము మే మెల్లరము మేల్కొందుము. ఆల నన్నింటి వేర్వేఱఁ బేరు పేరునఁ బిలిచి పాలు పితికి పితికి కుండల పాలు బిందెలఁ బోసి కాఁపించి యంతట నగరికిఁ గావళ్ళఁ బంపెదము. పదపడి పరుగున బోనాలు కుడిచి కడుపులు గడలించి పొలాలకుఁ దోలెదము నీటికి మేఁతకు లోటులేని యెల్ల యెడలఁ ద్రిప్పి త్రిప్పి మునుముగాఁ గసవును మేపుచు ముందుముందు మొకము వోయిన పొంతలు గుఱుతించుచు వాఁగుల వద్ద మడుగుల చెంతఁ బల్లముల మిట్టలఁ గొండలఁ గోనలఁ బోవుచు నంపగములు కేలఁబట్టి యంపపోదులు చంకఁ బొదివి ప్రుచ్చుల కెవ్వరికిఁ జిక్కనీయక మాపగు నందాఁకఁ గాచి తుదకు మందల పొందుఁ జేర్తుము. వంజలను పయిత మొక భంగిఁ జేఁపఁగఁజేసి పాడి మొదవులుగఁ గావింతుము. గొడ్డునకుఁ

గలుగు తెవులును సరిదీర్చి ముందటి యట్ల గాపు చేయంగ నేర్తుము బడుగులను గూడ లెస్స పరికించి చియ్యఁ బట్టు నట్టు చూతుము. పిదుకుటలోఁ గదుపు చేయుటలో బెదరు పో నడచి మాలిమి కలిగింతుము. దూడ చచ్చిన గోవునకు వేఱొండు లేఁగను గలిపి మరులు పుట్టింతుము. అప్పుడే యీనిన యావున కెద్దియేని ముప్పు వాటిల్లినను మొదవేది యేని యీచుకొన్నను కడుపులోనె చచ్చి చూలు క్రచ్చర వెడలకున్నను మందులు మ్రాఁకులు వెట్టి సంకటములు తీర్చి పసరంబు ప్రాణంబులు భద్రముగఁ గాతుము. నల్లలను సైత మొంటి నడపించి కాఁడికి వచ్చునట్టు లలవరింపుదును. మనసు వచ్చిన మంచి మంచి కోడెలను సమకూర్చి వానికిఁ జాలఁ గూర్తును. నాలిక పేరులు గురుదెవుఁగు గంటికురుము కప్ప నావురు కాలిగజ్జపలు కల్లవాపులు తిక్క పుష్పి పంపర యూడు బొడ్డు బొల్లూతి ముకుబంతి కవటు తలయేరు తొడవాతము దొబ్బ తెవులు సెల తెవులు కలిగినను మందులు వెట్టను గందువు గని మంత్రింపను నేర్తును. అడవి మెకంబులు కఱచి పుండు బూచి కావించినను ప్రాణంబు కలిగినఁ జాలు వాని నన్నింటి నెఱవుగా బ్రతికింపఁ జాలుదును. జ్వరపీడితులగు తల్లులు గల పిల్లలకును దల్లి నెడఁబాసిన బిడ్డల కెల్లరకును నాడు పుట్టువుల కును జాలు మా కన్నంత దనుకఁ బాలు పోయింతును. వాయసంబు పెట్టింతును. నా కాచు పసులు నన్నేలు రాజు నీకృప వల్లఁ జల్లఁగా నెగడుచుండును. నేఁడు మొదలు నిచ్చలు తియ్యని యాల పాల నిచ్చవచ్చిన తెఱంగున నేఁ దెచ్చి నీ పాద పద్మములను సేవించుకొందును.

నావుడు మీననాథుఁ డుల్లము పల్లవింప నాతని భక్తి ప్రపత్తికి ననురాగ మంది యోగీ, నీ మాట కనుమతించి తిమి. ఇట్టి కాఱడవి నడుమ నిమ్మహా పర్వతంబున నీ గుహలో నెమ్మది వసియించుచు నిఖిలంబు మఱచి నీలకంఠుని కృపచే నొదవిన యోగామృతమును దనివి తీఱఁ గ్రోలుచున్న మాకడకు నొంటిగ నీవరుదెంచుట కొడంబడి యూరకుం టిమి. ఒరు లెవ్వార లీ నీ జాడ గుఱుతించి మా కందువలఁ దెలియుట మా మన మొప్పదు. కావున నియ్యది యెవ్వరి కెఱిఁగింప వలవదు. నిచ్చలు నీవు మాత్రము దుగ్ధము తెచ్చి యిచ్చి వచ్చుచుఁ బోవుచుఁ బొచ్చెము పొరయకుండ పొల కువ మెలఁగుచు నాలపని చూచుకొమ్ము. నా విని వాఁడు చాఁగిల మ్రొక్కి పనివిని పరుగున మందకుఁ బోయి నాఁటఁ గోలె మిక్కిలి ప్రొద్దున నిద్దుర మేల్కాంచుచుఁ గడుపు లన్నింటను మేఁగు మొదవులు దుగ్ధములను దాన సంతనగఁ బిదికి లెస్సగ శోధించి నీరుబొట్టేనియుఁ జేరఁగ నీయక కణకణ లాడు నిప్పులమీఁదఁ గమ్మని పాక మొదవుదనుక నొయ్యనఁ గాఁచుచుండును. ఆమీఁద నంకుఁ దెల్లని బట్టఁగట్టి యాపా త్రను బదిలంబుగఁ జేతఁ బట్టి భానుఁడుదయించుటకు మున్నె పయనమై యా మహాయోగికి ముదముతో నిచ్చలు నిచ్చి వచ్చుచుఁ గొనసాగు భక్తితో నాగొల్లండు కొలుచుచుండును.

ఇట రాజమహేంద్రభూపతియు బాహుదర్పమువ్వారిగ నివ్వటిల్లఁ బగమహీపతులెల్ల రరిగాఁపులు వెట్టుచుండఁ జల్లఁగ రాజ్య మేలుచుండెను. సంతానము లేని చింతమాత్ర మెం

తయుఁ గలంత వెట్ట నా ఱేఁడు బాలేందుశేఖరుని మదిలోఁ గీలుకొలిపి తక్కుంగల వెయ్యావియు నెఱుంగక చిరకాలము సేవించెను. వరదుఁడగు నా సదాశివుఁడును ఱేని సేవకుఁ దద్దయు మెచ్చి కలలో వచ్చి కరుణ దీపింపఁ గామితార్థము సిద్ధించునని యాన తిచ్చెను. తోడనె ఱేఁడు మేల్కాంచి ముఖారవిందము వికాస మొంద నమాత్యవర్యులకు మనమార వినిపించి సమ్మోదమునఁ సదూఁగుచుండెను.

## సారంగధరుని కథ

ఇంతలో వింతగాఁ గొన్నినాళ్ళకా ఱేని పట్టంపురాణి యగు రత్నాంగికి నెల మసలెను. తనూలత వాడి యెంతయు నను వగు రీతిని దళుకొత్తఁ గోర్కులు పొడలఁ జాలు తుదముట్ట నిండారు పదియవ నెలలో నఖండ తేజస్కుఁడగు కొమరుఁ డావిర్భవించెను. నగర మంతటను బుత్రోత్సవము మహోత్సాహముగ నెఱపిరి. చంద్రశేఖరుని వరప్రసాదమున జనించుటం జేసి సారంగధరుం డని పేరిడి ప్రియంబున నా బాలుని బిలుచుకొనుచుండిరి. గోమునఁ బెరుఁగుచు రాకొమరుఁడు విదియ చందురుఁడుపోలెఁ జెన్నొందుచుఁ గళాకాంతులు తేజోవైభవము రూపురేఖలు చెలంగ లేఁబ్రాయము మలంగి యెలప్రాయమ్ము పెనంగెను. కులశీలముల కుద్దియగునటులు గుణగణముల కనువగునటులు దేశదేశము లరసి ఘూర్జరేశ్వరు కూర్మి పుత్రిని మంగళాంగియను కన్నెను సారంగధరున కొసంగి వివాహంబు కావించిరి.

ప్రాజ్యమగు సామ్రాజ్యము ప్రాభవం బెసంగుచుండ
గొనముల ప్రోవగు కొమరుఁడు వన్నె వాసి కూర్చుచుండ నొక
నాఁడు తేఁడు మంత్రులు సామంతులు హితులు పురోహితులు
కవులు గాయకులు కొలువఁ గొలువున్న తఱిని గోరకొప్పిడి
జేవురు బొట్టు సొగగం సరిదిద్ది క్రొమ్మించుఁ దలఁగించు పూల
దండ లొదలఁ జుట్టి మోమునగు మొగ్గ నొక్కఁడు చెవియందుంచి
గురిజ పూసల పేరులు మెడలో దాల్చి మత్తగజంబుల మదము
సేవనలంది తోరంపుఁ బులితోలుఁ పారుటాకులకాసె బలువుగా
వేసి కొదిమెపింగముల కొనవెంట్రుకలతోడి నల్లని దండఁ గడి
యంబుఁ బూని బెడిదపుటడివములు కేలఁ జెలువార నెఱుక
తేఁడొక్కండు కొందఱతో సరుదెంచి చాఁగిలి మ్రొక్కి వచ్చి
కస్తూరి కానుకపెట్టి యేనుఁగు తలలోని ముత్యాలొక కొన్ని
ప్రోల నుంచి కేలుగవ మొగిచి యిట్లులు విన్నవించెను.
దొరా, నాదు విన్నప మవధరింపుము. మున్ను శ్రీరామదేవుఁడు
ప్రముచ్చులగు రక్కసులను బరిపరివిధముల్ బరిమార్చి జయము
గొన్నపొలమునకు వేఁటవోయి యిదె వచ్చితిమి. గుజ్జుపుఁబిల్లలో
యనఁ గుప్పించి యెగయుచున్న జింకలగుంపులును వసమీర
నట్టిట్టు బిట్టు దాఁటుచుఁ బొదలు దుప్పుల దండును మసగులు
కన్నులఁ గప్పి యాఁబోతుల చందమ్మున మిసమిసఁ గ్రొవ్వి
మెసలు మనుఁబోతుల మందలును గంతలు మెండుగఁ బెంచి
పెందపులఁ గదరి పోరాడెడి కారుపోతుల జాతులును మనసు
వచ్చిన మెకముల మాంసంబులఁ గసమస మెసవి పుటపుటనై
మునంబున సుమాళించుచు గుమువులు వాఁకెడి బెబ్బులుల

మొత్తములును జెక్కుళ్ళ నిక్కిలి తీఁటలు తీఱఁ గొండచఱియలఁ గోరాడు మదనాగయూథములును బెట్టిదపుటుబివు లోలయ నురుము మొయిళ్లపై కెగుర గమకించి గర్జించు కంఠీరవంబుల కూటువులును బిక్కటిల్లి యంతటఁ దామై దొడ్డిఁ బెట్టినయట్లు పొదలుచున్నవి. వేఁటాడ దేవర, చయ్యన విచ్చేయుమన్న మాటను మనుజపతి మన్నించి వేడుకమీరఁ గొలువు నాఁటికిఁ జాలించి తరకసంబును సింగిణియుఁ జలమున దాలిచి మురువున మృగయాశృంగార మొయ్యనఁ జూపుచు వేఁట వెడలెను. వీర వరులగు దొరలు వేఱువేఱ వారువంబు లెక్కి బారులు తీర ఘోరమగు కాఱడవిని జేరి వేఁటకాండ్రు చెప్పిన చొప్పున మెకములను జట్టుముట్టి కకావికలు కావించి క్రొవ్వాడి యమ్ముల మిక్కిలియుఁ జక్కాడి కొమ్ములు వమ్ములు సేసి నడుములు నఱికివైచి కుత్తుక లుత్తరించి గుర్వులు తఱిగి కోరలు నురిమి పొట్టలు చీఱి కొంకలు ద్రుచ్చి బొండుగ లుచ్చి పీనుఁగు పెంటలుగ నెత్తురుటేరులుగ మెకముల పీఁచ మణఁచి యుల్లనఁ జనుదెంచి యొక్కెడఁ గమ్మని తావి చల్లెడు సరసి చెంగట వేడుక విశ్రమించెను.

అక్కడ నగరమున సారంగధరుఁడు తోడి రాచబిడ్డల తోడఁ గూడిమాడి వేడుక పందెములు చఱచి తాను గోమునఁ బెంచుకొన్న బిరుదు పావురమును మోము దువ్వుచుఁ గడువడిని మీఁది కెగిరిపో వైచెను. అదియు నుడుమండలము దనుక నుప్పరం బెగసి తక్కిన పావురముల నొక్కుమ్మడిఁ ద్రోటిలోఁ గెలిచి మినుకు మినుక్కను మిన్నులలోఁ గనుపట్టి క్రొంగున నెడ

బాసి తోఁకచుక్క చందమునఁ జువ్వన నిగుడి గతి తప్పి వచ్చి భూకాంతుని భోగకాంత యగు చిత్రాంగి మేడలో వ్రాలెను. రాణివాసములోపల లాంతులకుఁ జొచ్చుట మెచ్చుగాదంచుఁ దా నెంచి సారంగధరుఁడా పులుఁగుకై చిత్రాంగి లోఁగిలి కరుగ సాగెను. సుబుద్ధియను మంత్రిపుత్రుఁడా రాచూలినిఁ జెయి వట్టి కర్జం బిట్టిట్టి దనుచు నిట్టులనియె.



ఓహో! నెచ్చెలీ, యిదేమి సాహసంబు. ఆపద నెరియించు నిట్టి తలంపు నీకేల యొదవె? నేఁడు నీ యెఱుక యెటు వోయెనోయి! లోకంబున నీ యెఱుంగని నీతి యేది కలదు? రోవెలందుల జెందంబులలో నిలుకడ లెక్కడివి? పతి యెడఁ బాసిన జవరాండ్ర చెంగట నినుఁబోలు చక్కని రాచబిడ్డలు చరింపఁ జనునా! మది నేరక యూరక చొరఁ బారకుము. పావురము ప్రేమింతువో ప్రాణంబు కాంక్షింతువో భావించుకొమ్ము. వెలయాండ్ర వాలుఁగన్నులు ననవిల్తు వాఁడి బాణములని యెంచుము. అవ్వారి పలుకులు బొంకులు వారి పసలు వేసాలు వలపులు వావులు సున్న. కఱియు నో నేస్తుఁడా, నామాట యొండు వినుము కన్నుల కఱవు తీఱఁగాంత లేరేని నిన్నుఁ గాంచిన పిదప నలుఁడైన జయంతుఁడైన ననవిల్తుఁడైనఁ జీరికిం గొనరనఁ జిత్రాంగి మాట చెప్పనేల! ఆ బింబోష్ఠి నిన్ను బలవంతముగ వలవంతఁ జేపట్టి దిగిచి పైఁబడఁ దివురును. పరలోక భీతిని బాప పుణ్యము లెఱింగి నీవా కాంతను విడనాడి చయ్యనఁ జనుదెంచితి వేని జేనితో నొండు రెండు గావించి కల్లకపటంబులు

పెనవైచి నీమీఁద మోపుట నిక్కంబు. నామాట పాటించి నన్ను మన్నించి తెంపరితనంబు చాలించి వెనుదిరుగుము.

నా విని సారంగధరుఁ డామాటలు పాటి సేయక, పాపంబు పలుకులు కట్టిపెట్టుము. పిన్ననాఁటి చనవునఁ జేసి మేలమునఁ బలికితివి హా. నా భావసంశుద్ధి భావింప నేరనైతివి పెంజీఁకటి భాస్కరుని బాఱఁదఱుముట కలదా! నిప్పునకుఁ జెదలంటు నని యంత యొప్పునా! కామవికారం బెన్నఁడేని నా మనంబును గప్పునా? వామాక్షు లెట్టివారైన నాకేటి లోటు. రాజు వేఁటవోయిన నేమాయె. మాతల్లి రత్నాంగి మాఱు చిత్రాంగి నాకేల పాతకంబు సమకూర్చును? తప్పు లున్నవని యెన్ని నామీఁదఁ బతి కేల కోపము పుట్టఁజెప్పును. పుత్త్రుం డని భావింపక యతఁ డేల నన్ను దండించును. చాలుఁజాలు నీశంకలు. చయ్యన నిదె పోయి పావురము గొనివత్తు నని యవ్వనఁ జేయిఁ జాఱఁ దిగిచి విధి త్రిప్పులకు లోఁపడి చిత్రాంగి లోఁగిటికిఁ జేరెను.

చక్కనివారిలో మిక్కిలి చక్కనివాఁడయి, నిగనిగమను నీలాల వన్నెఁబోలు నెఱివేణి మెఱయఁ గలకల నవ్వుమొగంబునఁ దఱిసి వెన్నెలలు చిప్పిలుచుండఁ దలను జుట్టియున్న కనుదమ్ము లోక యందమ్ము నీనుచుండ నపరంజి వన్నె కొసరించు మైచాయ కొమరారుచుండ వన్నెచిన్నెలు వాఱఁ దీర్చి కట్టిన పట్టుకాసె నెన్నడుమఁ జెన్నొందుచుండఁ బాదకమలముల బిరుదు నూపురము ఝుంకించి మ్రోచుంయుఁడఁ జిలుకతెక్కల జిగి దువాళించు పచ్చల హారంబు మెచ్చు సేయఁ బదమ్ము రాగ

ముల పతకంబు వెడఁదయురంబున విలసిల్ల వజ్రాల కమ్మల తళుకులు నునుఁజెక్కులఁ బిక్కటిల్ల పలుచని పన్నీటిలోఁ బదను రామెదిపిన కస్తూరి తిలకంబు గుస్తరించి సింగార మలరంగఁ జెంగల్వపూవులు చాలిచి ఠీవిగా గోవజవ్వాజి మేన నలంది త్రిభువనసమ్మోహన మ్మగు యౌవన లక్ష్మీ చూప అను నివ్వెరపఱుప సారంగధరుఁడు చిత్రాంగి కన్నులపాలఁ బడియెను. మిఱుమిట్లు గొలుపు రూపలావణ్యమును గన్నులార జుట్టి యా మచ్చెకంటి కామవికారంబు మదిలోనఁ బాదుగొన మేనెల్లఁ బులకలు వొలయఁ దమకంబు దట్టమై నిగుడ నందెలు ఘల్లుఘల్లు మనఁగ మొలను నూలుగంతుగా మ్రోయు రత్నకలిత కంకణమ్ము లొక వింతధ్వను లొసఁగ నొయ్యారమొనవు నడకల నన్నువ నెన్నడు మాదంద వణఁకుచుండ గొబ్బునఁ బయ్యెదకొంగు పరవళ్లు త్రొక్క వెన్నెలలు క్రుమ్మరించు నెఱినవ్వు మొగముతోఁ గంతుని లోఁగొను కనుదోయి మెఱుగుతోఁ బసిడిసలాక వోలె మురు వొప్పుచు నెదురేగి, యడుగుల కెఱఁగి వినయమ్మున నిలిచిన సారంగధరున కిట్లనియె. ఓహో నిచ్చలు నీ రూపురేఖలు నెఱజాణతనము నెల్లవారు కొండాడుచుండ వీనుల విందుగ వినివిని వేడుకపడి నేఁడుగా కంటిని. వలచిన వాంఛితంబును దలవని తలంపుగ దైవము దయివార్చెను. అన్నింటికి నిఁక నీవు మాకుఁ గలుగ భూపాలుని యెడ భయములు కలుగనేరవు. మెచ్చు వన్నెలు మాని లోనికి విచ్చేసి మేడలో నొకింత విశ్రమింప వచ్చును. రారమ్ము. నావుడు వింత సవ్వాలయ నా రాచకొమరుఁడు తల్లీ! రవి కాంచని యంతిపురిలోఁ దల్లివని

నీయున్న కడకు జంకు లేక చనుదెంచితిని నీ పాదకమలములు మ్రొక్కఁగంటిని. నా మనవి వినుము ప్రాణపదంబుగ నేను జూచుకొంచుఁ బెంచుకొను పారావతం బిపుడు పొడవుగా నెగసి యెగసి వడిగా నిచ్చోటికి వచ్చి వ్రాలుట గాంచి వెంబడి నే వచ్చితిని. ఆ పారావతం బింకఁ గైకొనుచుఁ బసివిని యెద ననుడు నక్కాంత పోవచ్చును. సరి సరి. నాయెడ నీ పారవశ్యము నీ కేల రారమ్మనుచు నరనాథసుతుని జనవునఁ జేపట్టి సౌధంబుమీఁదికి నను వొందఁ గొంపోయి యచ్చోటఁ జిత్తమున హత్తుకొను రాజీవముఖుల చిత్తరువులను మెచ్చువచ్చు మెఱుంగు గోడల మెఱమెచ్చులను గొసరించు మంచిమంచి ధూపవాసనల పట్టులను జలువడి నొప్పారు ముత్యాల జాలకమ్ములను బంగరు గుత్తంపుఁ దలుపులను బొలుపాఱు పుష్యరాగమ్ముల మొగడలను గొమరాఱు గోమేధికముల కంబములను నీల మణులు నులఁచిన కీలుబొమ్మల సొగసులను జూపి మంచంబు చేరువఁ జేర్చి యచ్చోట భాసిల్లు గద్దెపై నాతని నుంచి యాతని పాదముల నత్యంత ప్రేమమునఁ బసిఁడి గిండిలోని పన్నీటఁ గడిగి భుగ భుగ వాసనలు గుబాళించు తమ్ములం బిమ్ముగ నొసంగి కమ్మజవ్వాది నీరెండలో మెదిచి చిక్కగా మేళవించిన చందనంబు నందంబుగా మెయినిండఁ దా నలంది గేదంగి రేకులు తలలోఁ జెరివి యంచతెక్కలఁ బోలు పసిఁడి పట్టుపుట్టములు కట్టను నమూల్య మణి కీలితాభరణములు దాల్పను సమర్పింప నా రాచకొమరుఁ డవ్వానిని జిగురుఁగేల నందుకొని యందె యుంచి యమ్ముదిత కిట్టు లనియె. తల్లీ యెల్లవేళలఁ

తల్లిదండ్రులు గూర్చి దాఁచియుంచిన ధన మెల్లఁ దనయులవి గాక మఱెవ్వరివి. వలసిన యవసరమున విచ్చేసి వాని నెల్లఁ గొనిపోవుదును. నా దాఁపరముగ వీని భావించి పెట్టెలో నిచ్చటనే దాఁచి యుంచుము. నావిని యా భామిని యవ్వాని నెమ్మనంబు విలాసభావముల నేమిటను బదను గావింప నోపక సిగ్గు విడనాడి కదిసి పట్టఁగఁజొచ్చు పోకడ నాతఁడు గుఱుతించి తల్లీ! నేనిటకు వచ్చి చాలఁ దడ వాయెను. సెల విమ్మని యనుడుఁ దత్తరము చిత్తమునఁ బిరిగొన మైమఱచి చిత్రాంగి యచ్చోట వాని కడ్డంబుగా వాకిట నిలిచి కందర్పునకు నన్ను బలి యొసంగి యెందుఁ బోఁ దలంచితివి సుందరాంగ యంచు గుణవంతుఁ డగు నా కొమరుని పై వలువ నంటఁబట్టి కలకల నవ్వుచు నన్నేలవా భావజాకార యను పలుకులు ములుకులై చెవులు చూఁడి సురసుర స్రుక్కి యొక్కింతసేపు మది బీఁకువోయి క్రమ్మఱఁ దెప్పిరి చెలికాని పలుకులు తలపోసి చిన్నవోయి గడగడ వడఁకుచు గన్నీరు వాఱెగను గ్రమ్మ సారంగధరుఁ డిట్టు లనియె. అమ్మా! తల్లి వని నిన్నుఁ దద్దయు నమ్మి యరుదెంచిన నా కిపుడు చాలఁగా మోసము వాటిల్లెను. అనుటకు వినుటకు ననువుగాని యీమాట పలుకుటకు నీ నోరెటు లోర్చెనోటు! ఎదిరి యెత్తు కించిత్తు నెఱుంగక వావివరుసలు వోనాడి యీలీల వలవంతను బొరలుట న్యాయమా! తల్లియే దైవం బని బుధు లందురుగాదె. కులశీలముల కిక్కయయి వన్నెవాసి కెక్కిన రత్నాంగి కడుపునఁ బుట్టిన నా కేల యీ దుర్మార్గవర్తనము? మా తండ్రి యాన. ఈ తలంపు విడనాడుము. నావుడు

సక్కొంత భూకాంతు పుత్రునకు మఱియు నిట్లనియె. ఔరా, సారంగధర యిలలో నెల్లరు నెల్లయెడల వాకొను నీ గొనములనుగూర్చి నీవు తెలుపుకో నేల! నీకేను బల్లిని గాను దైవంబును గాను. జేని భోగభామిని నవుట భావింపుము. భావజు బారిఁబడి మిగుల బడలిన పిదప వావు లేటికి వర్తనం బెందులకు? రతిపతి యాన. నా రాచిలుక తోడు. సరిసముగ నీ సాహచర్యమ్మున సంతోష తరంగ డోలికల నూఁగక కాలు కదల్పఁ జాల నని వాకిలి మూయఁ దివురు నా భామిని నాతఁ డిట్టులు కసరఁ దొడఁగెను. అమ్మా మా తండ్రి నిన్నుఁ జేపట్టిన నాఁడె నీవు నా తల్లి వైతివి. రత్నాంగి యోర్తు నీ వొకర్తుకవు గానేర్తురె! బుద్బుదప్రాయంబు లగు ప్రాయంబును గాయంబును గట్టిగా భావించి కావరంబునఁ గన్ను మిన్ను గాన వైతివి. జముఁడు పట్టి పల్లార్చక నిన్నుఁ గావఁడు సుమీ. ఎల్ల చనవుల నిచ్చి యరచేతిలో నిమ్మపండు వోలె నిచ్చలు నిన్ను మెచ్చుగఁ బోషించుకొన నిచ్చ వచ్చిన వైభవంబుల సుకసుకమ్ముల నుండక యీ వెడబుద్ధు లేల! విధిఁ గెలువ నీకు వశమా! మాయలు సూపి మదనుని మాయలఁ జిక్కి స్రుక్కి కటకటా యిట్లేల బేల వైతివి. చాలు తొలఁగు మనుడు చిత్రాంగి, యారా! యెప్పుడు నేర్చితోయి యీ దిట్టతనము? ఇన్ని విచారింప నీకేటికి? జముఁడంచు దోసములు కొండంతలు సేసి సారములగు సంసార సౌఖ్యములకు మూలకంద మగు కాయంబును నీరసపఱిచి సురిగిపోఁ జూతువా! చాఁలిక సుద్దులు చాలింపుము ఆవల నరనాథుఁ డెయ్యది గావించినను గానిమ్ము. నిక్కముగ నీకు

నేను చిక్కితిని. పాపంబు లేటివి! వావు లెక్కడివి! ఎక్కడి కొడుకులు! ఎక్కడి తల్లి! రోవెలందు లెవ్వరి యాంధ్రుడు! తా వలచినది వలయు ననుట తగదా! నలకూబరుని రంభ వలచి యుండదా! నిషధేశ్వరుని దమయంతి వలవదె! మంచివాఁడ వని యెంచితిని. నట్టి జగజాలి మాటల ప్రొద్దు పుచ్ఛ్రయము. సురలును నీకన్న సుగుణులు కారా! గౌతమువనితకు నింద్రుఁ డేటి చుట్ట మయ్యె! బ్రహ్మకు సరస్వతి యెట్టి భార్య! లోకమున వలపు లిటు లుండఁ గికురింతువేల సారంగధర యని వలపింపఁ బూనెను. అతఁడును దానికిఁ గటకటంపడి యమ్మా యీ వెడమాట లేల! లోకములు కల్పింపను బ్రోవను సమయింపను గర్త లైన వారి మాట మన కేల! నీ వెన్నిన రంభయు దమయంతియు నిట్టులు మెలంగి యపకీర్తి కట్టుకొనిరా! నా మాట పాటించి బుద్ధి కలిగి మెలంగుమని పలికిన నా కామిని చల్లని కృపారసము చల్లు నీ కులుకు చూపులు నా యెడ నిగుడ్పఁ నన్నేలవా! ఈ వియోగానలంబున కాహుతి కావించి నన్ని సడించి నా యసువులు ద్రుంతువా! యని కన్నులఁ జలువలు గ్రమ్మ మీటుచు వేఁడుకొను నా మొఱఁగుబోణిని సోఁకిన కందర్పభూతమును మాటల వదలింప వశము గాదని యెంచి తన జిలుగువలువను దానిచేతఁ బో విడచి రివ్వునఁ బినతల్లి యిల్లు వెడలిన సారంగధరు నిట్లు పలుమారు పగ చాటి పలికెను:—ఓరీ వలచి వచ్చిన కాంతను జుల్కన చూతువా! నను విరహాగ్నిలోఁ ద్రోచి తలపూవు కందక వెడలి పోదువా! ఇదె వినుము నా పూన్కి. నీమీఁదఁ గల్లకపటములు పెల్లుగ

నల్లి తేనికి విరప మెక్కింతును. అంగమచ్చముగ నీ వలువను జూపి రిచ్చవడి పీడెల్లఁ గాంచుచుండ నిన్ను విఱిచి కట్టించి కాలుసేతులు కండ తుండెములు కావింతును అనుడు నాతఁ డదరి బెదరి కాళ్లాడక యట్టె నిలిచి, తల్లీ నాయెడ నీకిట్టి పగ పూనదగునా! నీ మాటల ములుకులకుఁ జీకాకు వడి ధర్మశీలంబు నెట్టనఁ ద్రోచి ప్రాణంబు తీపిని నిమిషార్ధ సౌఖ్యమ్మున కొడఁబడి పలువుర మ్రోల రట్టులు దిట్టులు గుడిచి యాపైని యమయాతనల నొచ్చి వచ్చి హీనజన్మ మొందుట కంటెఁ గలకాలము కీర్తి వెలయ తేనికి నీకును బ్రియమునఁ దల యొగ్గి మనసు దిటవు పఱచికొని మెలంగుట మేలు. అట మీఁద దైవగతి నేఁ బోయి వత్తును దల్లీ యంచు వెడలి నగరి కరిగి ద్వారలను లెంకలను వీడుకొలిపి ఏకలమునకు చిత్తమునఁ దత్తరపడుచు మెత్తని పాన్పున మేను చేర్చి తాను జేసిన నేరమికిఁ దల్లడ మందుచు విన్ననై వగచుచు వెచ్చ నూర్పుచు మిన్ను మీఁదఁ బడ్డవడువున మిన్నక పడియుండెను. అటఁ జిత్రాంగియుఁ దన కోరిక కాదని వమ్ము సేసిన యా రాచ బిడ్డనియెడఁ గ్రమ్ము కోపమ్మున మై మఱచి ఱొమ్మునఁ దన గోళ్లఁ దనుఁదానె వ్రచ్చుకొని నేలఁ బడి మైలకొంగు ముసుంగు మునిఁగి మూల్గుచుండెను.

ఇంతలో రాజరాజేంద్రుఁడు చిత్రాంగి నంతరంగమ్మునఁ జింతించి మిక్కిలి వలపుగాలి చొక్కునకు స్రుక్కి వేఁట విడనాడి వీడు చొచ్చి ముత్తయిదువలు మేలుముత్యాల సేస లొదలఁ జల్లుచుండ రంగారు సింగారముల బంగారు బొమ్మల భంగిఁ జెన్నారు కాంతలు కలధౌత పాత్రముల

రత్నదీపము లమరిచి నివాళి పట్టుచుండఁ బోరిఁ బోరి వందిమాగధులు కైవారములు కావించుచుండ నగరి కరిగి రౌతులను దొరలను గవులను గాయకులను గ్రమమున ననిపి గుబగుబలు వాసించు జలమున జలకములు తీర్చి జిలుగు వలువలు మెచ్చు వచ్చునటులు తీరిచి యగరు గుబాళించు నలరులు దురిమి కస్తూరి మెయి నింత గాటముగ నలఁది తియ్యని బోనము కడుపారఁ గుడిచి బంగారు పాదుకలు సొంపారఁ దొడిగి యడపము వాని కేలు వలగేల నూఁది యల్ల నల్లన నడచి యల్లారుబెల్ల మగు చిత్రాంగి గీమునకుఁ జొచ్చి యామె చందంబుఁ జూచి విస్మయంబున మునింగి డెందంబులోన మిక్కిలి భీతి గదుర నిట్లు వచించెను. కాంతా యివేమి వింతలు! ఒయ్యనొయ్యన నాకెదురు విచ్చేసి ముద మాగ మొలక నవ్వులు వెలయించి మెఱుఁగుఁజూపుల నివాళించి యుపచారములు పెక్కు లొనర్చు నీవిదేల యిటు లైతివి! తొల్లి నాయెడఁ జూపు మోహమ్ము నేఁడు కనరాదు. మృదు భాషణంబులు మొదలె లేవు సింగారములు సేయక మేలము లకుఁ బూనక చెలులసంగడి మెలంగక రాచిలుకను గైకొనక రాయంచను గాంచక ముకురంబు పట్టక రత్నవిపంచి నల్లనఁ బెట్టి పరువంపుఁ బూబంతి పారవైచి నెమ్మియాటలు మాటుపఱిచి నేలలోఁ బరుండ నేల! మాయని వలువలు కలుగు నీ వేల మోము పుట్టములు గట్టితివి? ఎవ్వరు నీవంక నెగ్గాచరించిరో! నీతోడ నెవ్వ రెదురు వలికిరో! పోతుటీఁగ పొలకువయు నిన్నుఁ జేరరాదు గదా! ఎవ్వఁడు నీదెస గ్రేలు చూపను వెఱువఁడు? అతివ నా మంత్రు లెల్లరు నీ యానతి నొదలఁ

డాల్తురే. అడిచిన పొడిచిన భయంపడి పాఱెసి పాఁపఱేఁ
డైన నీ యాన నాఁగిపోవలయునే. ఇంత లింతలు చనవు
లొసంగిన నామ్రోల నీకలుఁగుటకు వెఱచుటకుఁ గారణ
మేమి! నాథుల వల పొత్తి చూపఁదలచి పూవుఁబోణు
లొక వేళ యలుగుట సాజము. కలనైన నినుదక్కఁ గొంత
వేఱొకర్తుక పొందెఱుంగ ననుటకుఁ బూవిలుతుఁడే సాక్షి.
పలుకు లేటికి నమ్ము నామాట. నీ మోముఁదమ్మిని మెదలు
కురులకు మత్తిల్లిన తేఁటిగములు చుట్టములు. కొదవు చందురు
డయ్యెడ నీనుదురను సందడించును గదే! నిగిడి వీనుల
నంటు నీకులుకు కనులు మగబేడిసల పొత్తు హత్తుకొని యుం
డును. నీ బాహువల్లికల కీడు బిసకాండము లౌనటే! అంద
చందములఁ జందనగంధు లెవ్వారు జగతిలో నీకు సాటి!
అలుక నీకుఁ దీఱెనా దళుకు పిసాళించు ముత్యాలపేరిత్తును.
మోము మల్లన మీఁది కెత్తితివా పద్మరాగముల పతకములు
పెట్టెదను. నవ్వొలయ నాదెసఁ బరికింతువా యివె పచ్చల
ముద్రిక నిచ్చెదను. నెయ్యమొలుకు తియ్యని పలుకు
పలికితివేని వజ్రాల కంకణములు కానుక కావింతును. నెమ్మిని
మనసార నన్నేలిన నీ నేలకు నిన్నే యేలిక యొనర్తును. మన
సిచ్చి మెలఁగవా యంచుఁ దలమీఁది మాణిక్యకాంతులు
తరుణిపాదముల బిత్తరింపఁ గదిసి మ్రొక్కిన నదియే కపటంబు
నెరపఁ బదను గల యదనని యా భామిని భావించి గొదు
కుచుఁ బొరలి పొరలి కనుగొలఁకులఁ జూచిచూచి యుసురసి
బిట్టు నిట్టూర్చి ముసుగు వాయునటు పుచ్చి మోముదమ్మి
యర వాంచి చేయూఁతగా నొయ్యన లేచి యేప్పుచు జెనితో

నిట్టు లనియె.— నాథ వేఁటతమి నడవికి నీ వేఁగిన పిదప నీ మీఁది నెయ్యమునఁ గాలము గడువఁ జొప్పడక నా ముద్దుల రాచిలుక నొద్దికగఁ గేలఁ గైకొని మురిపపడుచుఁ దేనెలుఁగుల్కు దాని పలుకులు వీనుల విందుగ వినుచుండ మైకంను తలంగిన యిందుబింబము పోలి తళతళ మెఱయు నాణిముత్యము భాతి మిసమిస మించు మీసమీసము లీలఁ గ్రొమ్మించులు మే నెల్ల నొరయు వెల్లపావురం బొండు నా ప్రమోల వ్రాలెను. ఎం దుండి వచ్చెనో యిదియని మదిలో ముద మొదవఁ దలపోయు చుండఁ జక్క తెగి పడిన వడువున జంకు గొంకులు లవలేశము లేక సారంగధరుఁ డిచ్చటికి వచ్చిపడెను. వచ్చి రెప్పార్పక వాఁడు నా పోఁకువ చూచి చిత్త మంతయు భావజాయత్త మగుడు దిటవు దూలి వావి వోనాడి కావరంబునఁ గడిసి నన్నుఁ జేపట్టి వన్నెచిన్నెలు సూపుచు హాయిలు పచరించుచు నన రాని వినరాని కాఱుకూఁత లెన్నెన్నొ పలికెను. నీ మిక్కిలి చక్కదనమునకు నీ మవ్వంపు జవ్వనమునకు నీసరసంబగు జాణ తనమునకు నీ విలాసవైభవమునకు నరనాథుఁ డెట్టులు తగి యుండును. ఇదె మొదలు నా మాట పాటించి నాకు నీకు నీడుజోడని యెంచి నన్నేలుము వామాక్షి యని పలికిన యా దుర్భాషలు చెవులు చుఱుక్కునఁ జూఁడి యులికి నా సిగ్గు కావఁగలవారి నెవ్వరిని గానక వగచి వగచి తల మిగిలిన కినుక నా కామాంధునిఁ గాంచి యిట్లంటిని. ఓరీ తులువ, నాపతి లేని యియ్యదనునఁ గొంకక యంతిపురి చొచ్చి యిట వచ్చి నన్నుఁ జేపట్టి యిట్టి పోకడలు పోయెదవా! ఉర్వీశున కే నెంతయుఁ గూర్తును. నా యొడలు ప్రాణము లాయనవని నమ్ముము. నీ

వేడ నేనేడ! నీకు దక్కుటేడ! చక్కఁగ వచ్చినజాడ పట్టి చనవోయి పాపాత్మ! పినతల్లిని బట్టి యిట్టి తెరువునఁ బోయిన పట్టి యెందైనఁ బుట్టెనా! అని విడనాడిన నన్ను బలిమి నాతఁడు కదిసి కొనగోళ్ళ నంతయు నిదె చూడుము వ్రచ్చెను. ముం జేతికంకణమ్మున కద్దమేల! అంచుఁ బయ్యెద వాయఁ దివిసి యుబ్బి క్రొన్నెత్తురు లొలుకుచున్న గబ్బిగుబ్బలు సూపి డగ్గుత్తికఁ బెట్టి నాథా! నీ కీవిధంబంతయు నెఱింగింపను నిలిచితిని గాని బ్రతుకఁదలచి కాదు; ఆతఁడు కామాతురుఁ డయి నన్నుఁ బట్టి వచ్చినపుడె నాకు నీవు మామవు! కోడలని నంట నీకు న్యాయము కాదు. నింద నొందక రత్నాంగి సంగడికె. నడువుము. ఆపెయె సురత సౌఖ్యంబుల సొక్కింప నేర్చును. అని పలికి యా మాయలాడి యాతని చేత నున్న చుఱకత్తి దిగ్గనఁ బెఱికి మెఱుఁగులు వాఱ మెడఁ జేర్చుకొనుడు సంభ్రమంబున రాజు దాని లాగివైచి ప్రియా, సాహసం పడెద వేల! నిన్ను మానంబు గొనిన యన్నీచుని సుతుఁడని కరుణమైఁ గావక పొగ రణఁచి నీపొగులు వారింతును. అని యూరడించి వెంటనె వెడలి యుల్లము తల్లడ మందఁ గోపము మల్లడిగొనఁ గొలువున కరుదెంచి మంత్రులను సామంతులను హితులను బురోహితులను వేగమె రావించి యయ్యుదంతము వినిపింప నందఱు కర్తవ్యత దొరఁగి నివ్వెఱవడి మోములు వాంచి బొమ్మలు పగిదిఁ బలుకక యూరకున్న వారిలో నయ్యూర్జితుం డను నమాత్యశేఖరుం డా ధరణీశ్వరున కిట్టు లనియె:—రాజా, యిది యూహించుటయు మహాపాతకంబు ఇది యెవ్వరికిని వాక్రువ్వఁ దగదు. ఎందు నే కథలందు నే

జాతులందు నిట్టివి యన్యాయ్యపు వర్తనములు మును చెప్ప విని యుంటిమే! అంతిపురంబున కలుకక తాను బోవుట తొలితప్పు. సవతి యీసునఁ బట్టిని జంపింపఁ దలంచి కల్ల బొల్లి పలుకులు దొంతి సేసి యీమె వినిపించెఁ. బొమ్మన రాదు. సారంగధరు చేఁత నీవిపుడు సైతువేని యీపాతకమున రాజ్య మేమి కానున్నదో! లోకములో నపకీర్తి ప్రాకుట గూఢి. జయ మన్నది సన్నగిల్లును. ప్రతాపము తొలఁగి పోవును./ తేజంబు మాసిపోవును./ కులము కూల్చిన యీ పాపిని బుత్రుం డని పెద్దఱికి ముంపక దయ మాలి పోఁగొట్టినఁ గాని నీ యాజ్ఞ యిలలో సాగనేరదు. దుష్టుఁడై తల్లి నట్లు చూడనేర్చిన యీకష్టు నిప్పుడే పట్టి కట్టి తెప్పించి పాము కఱచిన వ్రేలిని బోలి మనలక నఱికివైచి మనుటయే కర్జంబు.

నావిని మతిమంతుఁ డను మంత్రిసత్తముఁ డిట్లని వచింపసాగెను. ప్రభూ, నీతిశాస్త్రనుతత మిది గాదు; అర్థ నాశము- మనస్తాపము- గృహమందలి దుశ్చరితము ప్రకాశింపఁ జేయుఁ దగవని పెద్ద లందురు. తనయులు తమ పిన తల్లుల గీములకుఁ జనవున నొకవేళఁ జనుటయుఁ దప్పా! తామొనర్చు తప్పు లన్నియుఁ దరుణులు పురుషులపైని జూపి బొంకు లాడుట కలదు. పువ్వుల వాసనల నైనఁ బొదిపెట్టి గుది గ్రువ్వ వచ్చును. నీటిలో నిసుక బొమ్మల నైన నీఁదింప వచ్చును. వడగండ్లు గుదులుగ నైనఁ గట్టవచ్చును. కాని యింతుల యంతరంగంబు లెఱుంగ రాదు/ పుట్టువునైన దోఁడఁబుట్టువునైన జనకునైన జక్కఁదన మున్నపుడు మన మారఁ జూచిన మగువలకు మతి మారు నని మాధవుని

మోాగ్రిల పాండవపత్ని మాన్ము పలుకుట యెఱుంగమె! నాకుం జూడ చిత్రాంగియె నీ కుమారుని మారసన్నిభుని జూచి తాళిమి దూలి గొంకక పట్టి, లోంచిన లోను గాకున్నవాని నలిగి యీ వడువున మాయలు పన్నె నని తోంచుచున్నది. సజ్జనుం డగు సారంగధరుం డట్టి దోసమున కేల తొడరును? పరమేశ్వర వర ప్రసాదుండు వాండేల యిట్టివాం డగును? ఆలి మాటను గాలం దన్నక పండువంటి బిడ్డను గాఱడవులం బనిచి జాలిం దూలిన దశరథుని మాడ్కిం బుత్త్రుని దుని మించి తుదకు శోకమున బ్రుంగుడు పడెదవు. అనుటయుం గొలువువారెల్ల నౌనౌనని మతిమంతు నగ్గించిరి. మహీశ్వరుం డామాటలు విని యేదియుం దోంపక యూరటల లూంగు నుల్లమ్మునం గర్తవ్యము నిర్ణయింపను గాలు సేయాడక మోహ సాగరమున మునింగి మునింగి యిటు చూడవచ్చిన నింతిపై నేరమియు నటు చూడంబోవ నాత్మజు దోసమును గాదనరాక యగు ననలేక పలుమాఱు వగచి వగచి ఱెప్పలు వ్రాలవైచి తల యుంకించి పంకించి నేలపైం జూపు లొలయ ముక్కునవ్రేలిడి ఆపడి యొక్కమొగి నల్లె యుండెను. నీతిజ్ఞుండను మంత్రి యంతయుం బరికించి రాజా, మతిమంతుండు పలికిన మాట లన్నియు మితములు హితములు నయి యింపులు సొంపులు పొంపిరివో నేర్చుచున్నయవి. కలకంఠుల చిత్తములు చలదళ పల్లవాంచలములకంటెం జంచలములు. సారంగధరు నెంతయు మెత్తని మాటల నొత్తి పలుకను బుద్ధిమంతు నొక్కనిం బనుపుము. నావుడు ఱేండును వల్లె యని తన కూర్చు చుట్టాలను హితులను బురోహితులను

గూర్చి చనుఁడన్న వారును జయ్యన నరిగి వజ్రాల కాంతుల
మిసమిసలు మెఱయు పసిఁడి మేడలో నవసరం బడిగి యదను
చూచి చొచ్చి సారంగధరునికి మ్రొక్కి నిలిచిరి. వేడ్కతో
నా రాచబిడ్డ వారిని దన గద్దెచేరువ నుచితాసనంబుల నునిచి
చాలఁగా మన్నించి మీ రిందు విచ్చేయుట కేమి కారణంబో!
చెప్పుఁ డన్న నందఱకు శంకించియుఁ దుది కిట్టులు విన్న
వించిరి. రాజకుమార, సద్గుణ రత్నాకర, రాజేంద్రుఁడు
మమ్ముఁ బుత్తెంచుటయే మా రాకకుఁ గారణము. రాజును
నీవును సర్వదా మా కొక్కరూప. నిష్కలంకచరిత! నీ యా
నతి లేనిది విన్నవింప వెఱచుచున్నాము. అటులయ్యుఁ దప్ప
దయ్యెను. మొన్న మహీశ్వరుఁడు వేఁటాడఁ జన్న పిమ్మట
నాటల తమకమ్మునఁ బారావతముచొప్పు వట్టి వెనుకు నెపం
బున రాణివాసము చొచ్చితి వఁట. అట నీతి వోవ విడచి జేనికి
మిగులఁ గూర్చు భామిని జిత్రాంగిని గాంచి మోహించి కను
గానక మనసునఁ బిఱిగొన్న మదనావేశమున నామెను జేవట్టి
కలకటిఁ జేసితి వంచు సలయుచు సొలయుచు నామె వినిపిం
చినఁ జిత్తంబులోఁ గోపంబు హత్తుకొని భూవిభుఁడు కొలువు
దీర్చి యంతవట్టు నిజం బడుగుఁడని మమ్మిట్టులు పంపెను.
నా విని యాతఁ డెంతయు నాత్మలోఁ గలఁగి, యాహా! యిది
యేమి యపరాధము! మాయలు పన్ని యిట్టి రోఁతలు నా
మీఁదఁ జిత్రాంగి రూపించెనే! ఆ యమ్మ నామీఁది
యాగ్రహమ్మునఁ జేసి యొక వేళ నీ యుపాయము గడించెనే
పో! భూకాంతుఁ డిది పోలును బోలదనక జనని నాపై మోపిన
నింద నిశ్చయం బని యెంచెనా! ధరణీశుఁడే నా పాలి దైవం

బని సర్వకాలము నాత్మలో భావింతును. మిమ్మొక్కటి వేఁడెద వినుఁడు. అందఱు వినుచుండ రాజేంద్రుని మ్రోల నా మాటలుగా విన్నవింపవలయు. నిర్మలబుద్ధితో నీతిమార్గమున ధర్మంబు తొలఁగక ధరణి నేలెడి ఱేఁడు తప్పు విచారించి తగిన చొప్పున దండించెనేని పరమ శుభంబులు పడయును. నన్నుఁ జిత్రాంగి ముందటఁ బెట్టి నిలిపి యిరువురను దెలియ నాడించి నాయెడనిట్టి కల్ల కలిగినఁ దప్పక శిక్ష కావింప వలయు. అటమీఁదఁ బరమేశు నాజ్ఞ యెట్లున్నదో! అని కర్పూర తాంబూలమ్ము లిమ్ముగ వారికిఁ బసదన మిచ్చి పుచ్చెను.

వారును జెచ్చెఱఁ బోయి ఱేనికిఁ బ్రణామపూర్వక ముగ నిట్లని విన్నవించిరి. దేవర యానతి శిరసా వహించి సారంగధరుని గాంచి సర్వము మా నేర్చిన ట్లడిగి చూచితిమి. ఆతఁ డుత్తముఁడే గాని కల్లరి కానేరఁడు. దేవతా ముఖమునఁ బ్రమాణము గావించినఁగాని తక్కిన వేమియు నూహింపరాదు. దేవ, మఱియు మే మాతనిని దఱిమి తఱిమి తథ్యము చెప్పు మన్న నీ మాట చిత్రాంగిని ఘట్టించి యడిగితిరేని ఱేనితో నామెయే గట్టిగాఁ జెప్పును బొండని వచించెను. నావుడు ఱేఁడు వారి నెల్లరను దోడ్కొని యంతి పురి కేగఁ దమ్ముఁ గాంచి సెజ్జను డిగ్గన డిగ్గ యచ్చట హేమ స్తంభ మూఁతగా నిలిచి మునుఁగు దిగిచి వసివాళ్ళు వాడుచు వదనము వంచి కాటుకకన్నీటిని గడగోర దిద్దు మొదుగువాటుగ నున్న చిత్రాంగిని గదిసి యావనీశు ననుమతి నా దొర లిట్లు ప్రశ్నించిరి. అమ్మా, సారంగధరుఁ డిటుఁ

బారావతంబు నెపంబున నరుదెంచి నీతి మాలి తాల్మి దూలి దర్పాంధుఁడయి చెయివట్టె నని మీరు చెప్పితి రని మేదినీ నాథుఁ డెల్లరి మ్రోలఁ దెల్లంబుగఁ బలికెను. ఱేని యానతిని మేమును బోయి సారంగధరునిఁ జాలఁగ దూఱి నిక్కము వక్కాణింపు మంటిమి. అతఁ డది విని కటకటంపడి కట్టా! తనమీఁది కల్ల నామీఁద మోపెనా! ఱేని కిట్టిది వినిపించెనా! ఈమాటు మీరెల్ల రామెన గట్టిగా నడిఁగి రండనియె. దీని కేది త్రోవ. నావుడు నమ్మగువ యెలుఁగెత్తి యేడ్చుచు బిట్టు చలపట్టి రాజా, నన్నేల చంపెదవు? రచ్చల కీడ్చి రట్టు చేసెద వేల? సరివారిలోఁ జచ్చిన చా వయ్యెను. తెగి, చావఁబోవఁ గాదని పట్టెద వేల! పదుగురిలో నగుబాటు కుదురు పఱిచితివి. సరి సరి. నీకు లేని సిగ్గు నేఁడు నాకేల! నీ కార్యవాదులు నీవును గన్నార నిటు చూడుఁడు. అని వారి యెట్టయెదుటికి వచ్చి పైకొంగు వోవఁదివిసి బొమ్మనఁ గ్రమ్మన గాయము లిమ్ముగఁ జూపి యివి యెల్ల నా తప్పులే. ఇదిగో వలువయును జూడుఁడని మేదినీవిభుని మ్రోల నుంచెను. అది గాంచి భూకాంతుఁడు కినుక ముప్పిరి గొనఁగ నిందు లేశమును సందేహమ్ము లేదనుచుఁ గ్రచ్చరఁ బేరోలగంబునకు వచ్చి విద్వాంసుల నెల్లర రావించి ధర్మాసనంబు గూర్చి తల్లిని బట్టిన పాపాత్ముని దండించుట విధి యని యనుడు సభవా రట్టి దుండగీనిఁ గొనిపోయి నడ్డురేయి కాఱడవిలోఁ గాలుసేతులు గోయింపఁ జనునని ధర్మశాస్త్రములు వినిపింప నప్పని సేయుం డని ఱేఁడు తలవరులకుఁ జెప్పి తగువారిని బంచి చయ్యన లోనికిఁ

జని యొయ్యనఁ బాన్పున మేను చేర్చి నెవ్వగల నివ్వటిల్లు నంతలో లోకబాంధవుఁడు పశ్చిమాంబుధిని మునిఁగె. ఆకసమునఁ బొరిపొరి చుక్కలు పొడసూపెను. భూతములు కేలఁ ద్రిప్పెడి కొఱవుల రవ్వలువోలె నెడనెడ మెఱయుచు మిణుఁగురుఁబురువు లెల్లదెసల మెఱసెను.

అత్తఱి మిత్తికోఱలఁబోలు కత్తులు తళతళఁ గ్రాలఁ గేలఁ ద్రిప్పుచుఁ గింకఁ బేర్చిన కాలకింకరులో యన ఝంకించి అంకెలు హుంకృతులు చెలంగ నార్భటం బెసంగఁ దలవరులు బలువిడిఁ జనుదెంచి నగరు సొచ్చిన తెఱఁగు రాకొమారుఁ డెఱిఁగి భీతి మిక్కిలియుఁ బర్వ వలలో వెలువడి పోలేని పులుఁగు కైవడి భీరువోయి చిత్తమున నిట్టులు చింతింపఁ దొడఁగెను. అమ్మా చలపట్టి నామీఁద లేని దోషము పచరించి మాయలు పన్ని నన్నుఁ గోయింప నీకు మనసెట్లాడెనో! ఆడెఁబో నృపుఁడైన వివేకము దూలి తప్పొప్పుల కలరూ పెఱుంగక కనికరం బావంతయుఁ బూనక యేలొకో నన్ను నఱకింపఁ దొడఁగెను. నేఁటితో ధర్మము నిర్మూలమై నేల యంటెను. ఏల యీ పిఱికి! ఇటమీఁదఁ గాలకంఠుఁడు గాక తక్కొరులు నాకు దిక్కు కలరె! అని ధీరుఁడై యున్న యా శుభాకారుని విమలవిచారుని సద్యశోధారుని సారంగధరుని డగ్గఱి సారమేయములు బెబ్బులి నరికట్టి చీకాకుపఱుచు తెఱంగునఁ దలవరు లాతని నదలింప దీనుని నడిరేయిఁ గొనిపోయి నఱుకవలయు నంచుఁ గావలియుండ నా వార్త రత్నాంగి విని పిడుగు వడ్డపడువున గుండె చెదర మూర్ఛవోయి నేలఁ బడి కొంతతడవునకుఁ దెలిసి భీతి గదుర నల్లన లేచి పరిచారికలు వెంట రా నడుగులు దొట్రిల నంది

యలు మ్రోయ ముడివీడి క్రొమ్ముడి మూపుపైఁ జాఱఁ బగడంపు పెదవుల తడి యాఱఁ బాపట జిగిఁ దప్పి చీకాకు పడఁగ ఱొమ్మున ముత్యాల పేరులు గమనవేగమ్మున గంతు లిడ ముంగురులు చెదర వాలు గన్నుల నీరు వఱదలుగఁ బాఱఁ బయ్యెదకొంగు నేలఁ జీరాడ నెమ్మెను దీవ సొలసి యసియాడ సొంపులు వంపుఁబాయి మోము చెమరింప రాజేంద్రుని డాయఁ జేరి యిట్లని మొఱపెట్టెను. రాజా! నాబిడ్డ యేపాప మొనర్చెను? ఇంతి మాటలు విని కొడుకును గోయించిన క్రూరాత్ముఁడే యితఁడంచు లోకులు నిన్నుఁ బ్రువ్వఁదిట్టరే? నీతిత్రోవ తెఱుంగవైతివే. చిత్రాంగి మందులు తల కెక్కెనా! ఎందేని రాజులు భోగకాంతల కెవ్వయేని మోహమున నొసఁగుట కలదు కాని బిడ్డను గోయింపఁ జన విచ్చిరే! గురుభక్తినిరతుండు కోమలాంగుఁడు దురిత దూరుఁడు నా కొడుకు కిట్టి చెయిదములకుఁ బాలువడునే! కామాంధుఁడవు కావున నియ్యది కపటంబని గుఱుతింపనైతివి. ఇకనైన నా స్వామీ, పుత్రుని నీతప్పుఁ గాచి విడిపింప వేఁడెదను. పురము వెడలి పొమ్మన్నను బిడ్డతో నడవులఁ జేరి తాపస వృత్తి నాకులలములు మెసవి మనియెదము. కొడుకుం గోడలు నేను దూరభూములకైనఁ దొలఁగి పోయెదము. ఈ రాజ్య భోగంబు లిఁకఁ జాలును. అంచు దుఃఖావేశమున దూఱు నా రత్నాంగిని జూచియుఁ జూడనట్టులు తెలిసియుఁ దెలియనట్టులు భావించు రేనిని గాంచి రత్నాంగి డెందమ్మునఁ గ్రందుకొన్న శోకమ్ము నోర్వలేక కన్నుల కఱవు దీఱ నా బంగారు కొండను జూపరే యని పెల్లుగ దురపిల్లుచుఁ గొడుకు నగరి కరుగ నత్తఱి

నచ్చోట నాగపాశములఁ జిక్కిన రామభద్రుండువోలె నల
యుచు సొలయుచు సొంపేది యున్న సారంగధరుఁ గాంచి పుర
పురఁ బొక్కి యారా! చిత్రాంగి యింతగాఁ జేసెనా యంచుఁ
జెందమ్మిరేకులఁ బోలు చేదోయిని మొగము ముందలయు
మోదుకొంచు బిడ్డపైఁ బడి యేడ్చి యేడ్చి, బాబూ యిది యేల
యిటులయ్యెరా! చిత్రాంగి నీ తల్లి కాదె! ననుఁ జూచినట్లు
యామెను మన్ననఁ జూడవలదా! తొల్లి యెల్లవేళల నీమోముఁ
బొడగానని యీ యావినీతి నేఁడేల చెల్లెను? పరకాంతలపయిఁ
జూపులు పఱుపనివారు లాఁతుల దోసము లెత్తి పలుకనివారు
దేవతాసములని యెఱుంగవె? నిచ్చలు గుణవంతుఁడ వని
మెచ్చుకొను నా నోరు నేఁడిటు లణఁగవలసి వచ్చెఁగా! ఎన్నో
దండి నోములు నోఁచి నోఁచి కడుపారఁ గన్న నినువంటి
కళ్యాణశీలునిఁ గుమారరత్నమును జిత్రాంగికై నేఁడు కొం
పోయి గొఱియగాఁ జేసి కోయింప వలసి వచ్చెనే! చిన్ననాఁడు
నీ యడుగుఁదమ్ములలో వెలయు వ్రాఁతలఁ జూచి యెఱిఁగిన
వారెల్ల రీతఁ డెంతో కాల మెన్నిక మీఱు మను నని చెప్పిరే
కాని నడురేయిఁ గాలుసేతుల కోఁతలు పడి యనద చావు
చత్తువని యేరును బలుకరైరె. గుణాధారుఁడ వగు కొమ
రుఁడా యిట్టి వధకు నీ వర్హుఁడవా? తొల్లి యెవ్వరి నే నేమి
చేసితినో! ఇవ్వడువున నిప్పుడు వేఁగవలసి వచ్చెను. అని శోక
దవానలమ్మున నలయుచు నున్న తల్లి మోమతఁడు కాంచి
యమ్మా, నే నెల్లప్పుడు చిత్రాంగి నంతరంగమ్మున నీకు
మాఱుగ నెమ్మితో భావింతును. ఆమె కామావేశమున నన్ను
డాయవచ్చిన తఱిని దగదు నీకుఁ బొమ్మనుచుఁ బలుదెఱం

గుల వేఁడి వేఁడి తొలఁగి వచ్చితినే గాని దోసము లవ వేశమేని నేను జేసి యెఱుంగను. మంచిసెబ్బర లెఱుంగక మనుజపతి యాలిమాటలె నిక్కమని యెంచి నన్నుఁ జంప నిశ్చయించెను. సభలోని వారును సమయమునకుఁ దోఁచినటులు తలలూఁచిరి. ఇందలి నా వైఖరి శివుని కొక్కనికే యెఱుక. కడుపునఁ గన్న మోహమ్మున నిటకు నీవు రావలసె. రాజునాజ్ఞ మీఱి యెందును బోరాదు. కలనైన జేనిని గల్లరి యని యనకుము చిత్రాంగి దేవితోఁ జెలిమి తప్పకుము. నా కూర్మి లెంకలను నాదు ననుంగుఁ జెలికాండ్రను నన్నుఁ బోలెఁ జూడుముఁ. నన్నింక మఱచి విచారము లడఁచి మెలఁగుమమ్మ యని బుద్ధులు సెప్పి యడుగులఁ బడి యున్న యక్కుమారుని రత్నాంగి గ్రుచ్చి కౌగిటఁ జేర్చి దీవన లిచ్చి హాయని యేడ్చి యింతటి పాపమా! నా పట్టి నాకు దక్కవా యంచుఁ దల యూఁచి బిడ్డ మొగమ్ము చూచి తలవరుల కప్పగించి పోయెద నని వేచియుఁ బోలేక మగిడి పొగిలి పొగిలి మూర్ఛ వడియుఁ దెప్పరిల్లియుఁ గన్నీరు నించుచు హాయని యఱచుచుఁ జూపఱు పురపురఁ బొక్కుచుండ నెట్టకేల కెట్టులో యింటిపట్టు చేరి నేలఁ బడి పొరలుచు బిట్టు దురపిల్లుచుఁ గాలము గడపుచుండెను.

అంత నడురేయి యగుడుఁ దలవరులు తడయక సారంగధరు దరిఁ జేరి సంకెలలు సడలించి వీడిన జడను జక్కఁగ నల్లి మొగలిఱేకులు కొన్ని యిమ్ముగఁ జెరివి కస్తూరిబొట్టు మెచ్చుగాఁ దీర్చి పలుచగా నొంటినిఁ గుంకుమ నలఁది పట్టుదోవతిని గట్టనిచ్చి నగలు నెమ్మేన నిండుగ దిద్ది కలువపువ్వుల దండ గళమున నుంచి కప్పురపు వీడెంబులు కమ్మనివి యొసఁగి వివి

ధాయుధ ధారులయి యతనిం గొంచు నరుగుచుండిరి. అత్తఱిం దఱచుగఁ గుండెల్లను జెండాడి విటతాటముగ గంతులు వైచు రేచులును గ్రందుగ మందలుగఁ జేరి యఱచు నక్కల మొత్తమ్ములు నిట్టులు నట్టులూ బిట్టు పఱచు తోడేళ్ళగుంపులును లేఁబచ్చిక నోటఁ గఱచి పఱచుచు దుప్పులను బట్టి బొండుగలు విఱిచి నెత్తురు ద్రావు సివంగుల పిండును మెఱుంగుం గోఱలు మెఱయ మెకలెత్తి నోళ్లు తెఱచి యఱుకుచు మల్లడిగొను మనుబోతుల మందలును ముక్కిక్కడి మెకములఁ జిక్కువఱచి గర్జించెడి కడిఁది బెబ్బులులును గాకుల మెడలను దునుము మూఁగు నులూకముల భారమున వీఁగు వటవృక్ష శాఖలును గలిగి పెనుభీతి కలిగించు కాఱడవిలోఁ దలవరు లలయక వడి వడిగఁ జొచ్చి కులపర్వతముఁ బోలు నొక కొండ చేరువను జేరి యట వధ్యశిలమీఁద సారంగధరు నిలిపి యాతని మేనఁ గల నగల నొగిని దిగిచి పొడవైన యాతని మూఁపులు చేతులు నన్నువ నెన్నడుము నెడఁద యురంబును- వీనులఁ దాఁకు నిడువాలుఁ గన్నులును నల్లని కురులు చందురు బింబమువోలె నందమ్మగు మోము చూచి వారలు తల లూఁచి మదిలో ముప్పిరిగొను శోకమ్మునఁ గనుగొనల నశ్రువు లొలుకఁ గాలుసేతు లాడక వికలచేతస్కులై కొంతతడ వూరకుండిరి. వారి వైఖరి యెఱింగిన యా రాచబిడ్డ, యారా! యీరీతి మీర లెడసేయ నేల! ఱేఁడు మూఁడు సారులు సెల వొసంగినపిదప ధాత నా నుదుట వ్రాసిన వ్రాఁత తలఁగునె! తొలి పుట్టువున నేఁ జేసిన దుష్కర్మముల ఫల మిది. మీకును నాకును వైరం బది యెన్నఁడును లేదు.

మీ కీకృతనఁ బాతకంబును జేర నేరదు. ఏలిక పంపు కావింపఁ గొలిచినవారు తండ్రిని బొలియింపు మన్నను ముందు నకు రావలయును. జంకక గొంకక చేయవలయునది చేయుఁ డనుడుఁ గలఁక పోనాడి తలవరు లాతనితో నిష్టదైవమును దలంపు మన్న, నౌరా! తల్లిదండ్రులను మదిలోఁ దలంతు నన్న నన్నుఁ గోయఁ బంపినది వారేగదా! ధర్మదేవతను స్మరింతు నన్న నయ్యది నేఁటితో నణఁగిపోయెఁ గదా! తల్లియుఁ దండ్రియు దైవము నెల్లరు నెల్లభంగుల జగదీశ్వరుండైన యా మహాదేవుఁడే నాకని హృదయకమలమున నాతఁడు తరుణేందుశేఖరుని గుదురుపఱిచి తరలక యుండెను.

అత్తఱిఁ దలవరులు వాఁడి మీఱు కుఱుచ కత్తులు నూఱుకొని వాని దరిఁ జేరి కాలుసేతులు నొక్కట గట్టిగఁ బట్టి వఱదలై నెత్తుగు జొత్తిల్ల గఱగఱఁ దఱిఁగియుఁ గీళ్లు తొలఁగిన బొమ్మవోలె వ్రాలి మూర్ఛలో మునింగిన యా రాచబిడ్డను జూచి యడరుచు నా చావు చూడనేల పోదమని చేరువ పొదలో డాఁగి యుండిరి. అంతఁ గొంత తడవునకు నొయ్యనఁ దెలిసి నలుగడలు వెదకి యెవ్వరిఁ బొడఁ గానక నెవ్వగ నివ్వటిల్ల బోరునఁ గన్నులలో వెడలిన బాష్పధారలు నెమ్మొగంబున జాలువాఱఁ దొఱఁగు నెత్తురుపేట దొప్పఁ దోఁగి కుంతలములు చెదరి మొగమంతటను జీకాకుపడఁగఁ దీవ్రమగు నా బాధచే నసువు లుస్సురుస్సు రన నయ్యో! అమ్మా! యంచు నేలఁబడి పొరలుచుఁ బెనుధూళిఁ గ్రుంకుచుఁ బల్మారు వాపోవుచు నవయవంబుల నంటఁజేరి బంతులు తీరి పాఱు చీమలనేనియుఁ దొలఁగింపఁ జేతులు లేక కోసిన

గండ్లను దోఁగి జుమ్మనుచుఁ గొట్లాడు నీఁగలను సైతము జోప నయితి గాక పొలుసు కంపునకు డాయు మెకముల నదల్పను ద్రాణయు లేక తలవరులార, మీరైన నేతెంచి నాతల ద్రుంచి నొప్పి తొలఁగింపరా! పంచభూతములార, వంచన సేయక నాకుఁ బంచత్వ మొసంగరా! క్రూరమృగములార, మీరైనఁ బని పూని నాబాధ తీర్పరా! ఓయి కార్చిచ్చా! నీవైన వచ్చి నన్నుఁ గాల్పవా యని దురపిల్లుచు మదిలో నెంతయు వగచుచుఁ దుది కొకింత ధైర్యంబు కుదురు పఱిచికొని తన కర్మఫలంబని వగచి చిత్రాంగి మాయ యని పొగడి కటకటా! దైవమా కరుణింపవా యని యఱచి తన మ్రోలఁ దునకలై పడిన కాలుసేతులను గాంచి మంత్రి పుత్త్రుని మాటలను మదిలో నెంచి తల యూఁచి యౌరా యని యొక తూరి నవ్వును; వేఱొకమఱి యేడ్చును. ఒకపరి పాడును; వేఱొకపరి మూల్గును. గిరీశా సకల లోకేశ్వరా, శంభూ నీవే శరణని సంతాప మందును. అంత దివి నుండి ధర్మదేవత యనుకంప వహియింప నిట్టులు పలికె:—

ఓయీ కుమార, వగపేల యుడుగు మింక. ఎట్లును నీకు నీవిధి తప్పనేరదు. నీ పూర్వవృత్తాంత మంతయు వినిపింతు వినుము. అవనిలోఁ గౌశాంబి యను పట్టణ మొండలరారుచుండును. ధవళచంద్రుం డను ధరణీశుఁ డద్దాని నేలిక. ధీమహితులు జయంత సుమంతు లను నిర్వు రాతనికి మంత్రులు. అందు సుమంతు నెంతయు భూకాంతుండు మన్నించును. అది యెఱింగి యీసు పూని జయంతుఁ డనారతము సుమంతుఁ జంపను వేచియుండి జేనికిఁ దద్దయుఁ గూర్మిని గొన

సాఁగఁ గూర్చు భోగకాంత నొకర్తుక నేకాంతమున రావించి మాడలు భూషలు కొల్లలుగ నాపె కొసంగి వన్నెవన్నెల యంచు లోలయు పుట్టములు కట్ట నునిచి యాపె చిగురుఁగేలు చేసేతఁ బట్టి డగ్గఱఁ దిగిచి యిట్లని పలికె:— భామినీ, యొక మాట. ఱేఁడు నన్నెల్లప్పుడు తక్కువ పఱచుచుండును. సుమంతుని మతిమంతుఁ డంచుఁ జాలఁగ మన్నించును. అద్దాన నాతఁ డెంతయు దర్పించి కావరమునఁ గన్ను గానక మిన్ను తెలియక యున్నవాఁడు. కావున నాతని నవశ్యము చెఱుచు నుపాయం బది చింతించి నీ కెఱింగింప నిన్నిటకుఁ బిలిచితిని. ఎట్టులైన నిట్టిది కనుపెట్టియుండి యేమరినయెడ సుమంతుని చెప్పులను బట్టుకొని పోయి లాఁతివారెఱుంగ కుండ కను మొఱఁగి భువనసుందరి పాన్పు క్రిందను మెలకువ నునిచి నా కంటిలోని నెరసును దలఁగించి నా తుందుడుకును బోకార్పుమని వేఁడుకొనుటయు నదియు వల్లెయని వేచి యుండి యొకనాఁడు వంచనతోఁ బట్టపురాణి మంచముక్రింద సుమంతుని పాదుక లుంచెను.

అంత భూకాంతుఁ డెంతయు వన్నెచిన్నెలు పచరించి యక్కాంత దరిఁ జేరి హాయిగఁ గాలము పుచ్చి యొయ్యనఁ దమ్ములం బుమియఁ జయ్యనఁ దలను వంచి మంచంబుక్రింద నున్న పాదుకలను గాంచి యెవ్వరి వివ్వియని యడుగ నుల్లంబు ఝల్లని యులికి యా రాణి వెలవెల్లనై కన్నీరు మున్నీరు కాఁగ వడగాలికి వణఁకు వనలతవోలె నొడలు గడగడ వణంకుచుండ నొం డెద్దియుఁ బలుకనేరక నేలను గాలివ్రేల వ్రాయుచుండెను. ఱేఁడది యెఱింగి యడరు కోపమున నట

వెడలి కొలువు తీర్చి మంత్రులను హితులను బురోహితులను బుధులను రావించి, యీ పాదుకలు తెప్పించి వారి దెస నరసి యివి యెవ్వరివో యెఱింగింపుఁ డనిన వారెల్లరును వెఱఁగు దోఁప వెఱపు గదుర నొండొరుల మోము లొక్కటఁ జూచుకొంచు బుడబుళ్లఁ బోవుచుండఁ గాలకేతుఁ డను మేలుతలారి కేలు మోడ్చి ఱేని చెవి డాసి స్వామీ, బొంక నేల! ఇవి సుమంతుని పాదుకలే నిక్కమని పలికెను. అది విని కనుగవఁ గెంపు లొలయ ఱేఁడు సుమంతుని గనుఁగొని ఓయీ దురాత్మ, యొరుల నెరిని గాదని నిన్ను యెన్నికగ నమ్మి సర్వ సామ్రాజ్య భారము నీయందు యునిచి చంపను బెంపను నిచ్చలు నీకె చనవిచ్చి సంతోషమున సర్వ వేళల నవసరం బిచ్చి చాలఁగా మన్నించి యుండుట కిదియా ఫల మంచు నయవిదులను ధర్మజ్ఞులను గాంచి మీరితని దుష్కృతికిఁ దగ్గ గతి గావింపుఁ డనియె. వారును ఱేనితో వీని సర్వ స్వము గైకొని నడురేయి యీతని విఱిచి కట్టించి సట్టడవిలోఁ గాలుసేతులు కోయింపఁ బంపుఁడనిరి. అట్లె ధనేశ్వరుండు తలవరుల కాజ్ఞ యొసంగి కొలువు చాలించెను. ప్రొద్దు క్రుం కుడుఁ దలవరు లా మంత్రిసత్తము నొత్తి బంధించి యాలు బిడ్డలు బంధుమిత్రులు వాపోవుచుండ నిరపరాధు నాతని నడ విఁకిఁ జేర్చి కాలుసేతులు గడికండలుగఁ గోసి విడిచిరి. ఆ బాధ కాతఁ డడలుచు సర్వేశ, పరమేశ్వర, యకారణముగఁ బగపూని దయ మాలి నన్నుఁ బట్టి యిట్లు కోయింపఁగా నెవ్వఁడు కుటిలోపాయము పన్నెనో యాతఁడును నిట్లె కోఁతలఁ బడి గోడు గుడువ నిమ్మనుచుఁ బ్రాణములు

పాసెను. ఆ జయంతుఁడు నీవె. ఆ సుమంతుఁడు రాజమహేంద్ర భూపతియె. ఎక్కాలమున నెవ్వఁడేది గావించునో దాని కుద్ది యగునట్లు లనుభవింపక తప్పదు. తొల్లి యీ దుష్కృతివల్ల నీకీవిధి పాటిల్లెను. ఈ పుట్టువున నీయెడ దోసము లవవేశము లేదు. రాజకుమార మేలు రాఁగల దిఁక. సిద్ధపదంబు నీకు సిద్ధమై యున్నది. శారీరసిద్ధియు సత్వరమె సమకూరును. అని పలికి యశరీరి చెచ్చెర నణఁగి పోయెను.

ఆ క్రేవఁ బొంచియున్న తలవరు లది యంతయు విని సుదతి మాటలకు లోఁగి ఱేఁడు సేసిన దోసమే యిది యని యెఱింగి కామాంధున కక్కటా వివేకంబు కలుగునా యంచు నీసడించుచు నుస్సురనుచుఁ బురి చేరిరి.

అంతఁ గలువల సేస్తగాఁడు చలువలు వెదఁజల్లుచుఁ బ్రాగ్దిశావధువు చేతి స్నిగ్ధమగు నద్దమో యనఁ గెంజాయలు ప్రోగిడి వలరాజు సమ్మెలు బెడిదము లొనర్చుచు సంద్రము మిన్నంద జక్కవలు సొట్టువడఁ జకోరముల కోరిక లీరిక లెత్తఁ గమలముల నేఁచి కలువలఁ గాచి నెమ్మనఁ గలకందు చెన్నొంద వెన్నెలలు గ్రుమ్మరించుచుఁ జిమ్మచీఁకటులు విప్పుచు విరహుల మంటయై విబుధుల పంటయై యాకసమునఁ దోఁచె.

అత్తఱి మత్స్యేంద్రుఁ డా కొండగుహనుండి వెడలి రాకుమారుని యార్తరావము చెవుల సోఁకిన నంతయు నాలించి యబ్బురం బంది కరుణ వాటిల్లఁ జూచి వత్తుఁ గాక యని కుఱుచలగు కెంజడలను గొప్పుగా నివిరి వెన్నెలల వన్నె

చిన్నె లొలయు విభూతి మేనెల్లఁ గలయ నలఁది కట్టాణి ముత్తెములఁ బోలు సంకుపూసలను బూలదండగఁ బూని గరుడపచ్చలు కూర్చిన గౌళరుద్రాక్షలు చేఁబట్టి పద్మరాగముల జాలు మీఱఁజాలు పట్టుగంత మేన దాల్చి దివ్యౌషధమణులచే భవ్యమైన కక్షపాల చిగురుఁ గేల వెలయుచుండఁ బటికకంపు లాతాము వింత కాంతు లీనుచుండఁ బచ్చవన్నె యల మించియున్న యోగపట్టె బిగించి మిసమిస జిగి మీఱు నొడ్డాణము పెట్టి మెఱుఁగును గిఱికొను చెవిపోగుల కాంతులు చిందులు ద్రొక్కుచుండఁ గొండనుండి డిగ్గి యల్లల్లన వచ్చి, యొడలి నెత్తుటిలోఁ దొప్పఁదోఁగి నొప్పిచే నెమ్మొగమ్ము నేలమీఁద మోపి పనవుచున్న యా సారంగధరుఁ గనులారఁ గాంచి శివశివా యని చెవులు మూసికొని మారాకారుఁ గుసుమ సుకుమారు నీ కుమారుఁ గోయ నెంతటి తప్పు గావించెనో చూతమని యాతనిఁ గదిసి బిడ్డా, యెక్కడి వాఁడ వోయి? ఈ దురవస్థ నీకేల దాపరించె! చెప్పుమా యనఁ జెవుల నమృతము వోసినట్లు వేడుక మీఱ ముంజేతు లూఁతగా మొగ మొయ్యన నెత్తి కనుగవ విచ్చి కమలాప్తుని బోలు నా నాథముఖ్యు నా భూనాథ సుతుఁడు కాంచి మ్రొక్కి కేల్గవ తల మీఁదఁ జేర్చి యిట్లని సవినయమున ననియె.— తండ్రీ, వినుము. రాజమహేంద్ర భూపాలుని తనయుఁడను. నన్ను సారంగధరుఁ డని యందురు. వేకలినై యొకనాఁడు విధిత్రిప్పులకు లోనయి పావురము వెంట నంటి యొంటిమైఁ బినతల్లి యింటికి నేఁగితిని. ఆయమ్మ కామావేశమ్మున ననుఁ గాంచి పట్టుటయుఁ దగదనియుఁ దల్లికొడు

కుల మనియు మహాపాతక మనియు వలదు పొమ్మనియుఁ దలఁగి వచ్చితిని. దాని కలిగి యామె కల్లఁబొల్లులు పెల్లుగ నల్లి తన దోసము లేశమేని లేదని జేనితోఁ జెప్పి యీతీరు, ననుఁ జేయించెను. ఇంతియ గాని పాపము నే నేమియుఁ జేసి యెఱుంగను. పరమేశు నాన. నీ పాదము లాన. బిడ్డయని యింతైన దయ లేక యంగనమాటలె యవనీశుఁడు నమ్మి మది వోయి నన్నిట్టులు కోయించెను. నరముల బాధ ప్రాణము తీయుచున్నది. తొలుచుచున్న పురువులను దుడువను జోఁపను జేతులు లేవు. తలనుగూడఁ దఱుంగుఁ డని తల వరుల నడుగనైతిని. నా మనవి విని స్వామీ, నీవైన జీవము పోవుటకు మందేదియే నిచ్చి నన్ను మన్నింపవా! యోగీంద్ర! పాపము నిన్నంటదు. అని కొంతవట్టు తెలివొంది మహానీయు, నీపెంపు గుఱుతింపక యీరీతిఁ బలికితిని. నా తప్పు సైచి దయాదృష్టి ననుఁ జూచి నన్నుద్ధరింపుము. నా తల్లివి తండ్రివి నీవె. ఆర్తరక్షక నీ వెవ్వరవో? ఈ వేళ నా వగ పోకార్ప విచ్చేసిన విశ్వనాథుఁడవో! నిచ్చలు నీ కొండగుహాలలో మెలంగు సిద్ధనాథుఁడవో! అరయ ని మహిమ తెలియ నా తరమా! చూడుమా స్వామీ, నీ గాలి సోఁకి నామేన నొప్పి కొంత యణఁగిపోయెను. అయ్యో, ఒక్కింత తడ విక్కడనే యుండవే యని దైన్యంబు దోఁపఁ బలుకు నాతని పలుకుల కలరి సిద్ధుం డాతని డగ్గఱి మేనల్లన నిమిరి యడలకుమోయి. ప్రాణములు విడువ నేమిటికి? విను నామాట. వాలిని బొంచి వేసిన దోషమునఁ జెంచుచే శ్రీకృష్ణుఁడు వ్రేటు వడఁడె? చేసిన కర్మము ఫలము గుడువక దైవ మేరినైనఁ దొలఁగిపో

నిచ్చునా! శరీరధారి కిట్టిది యనుభవింపక తప్పదు. కావున నిబ్బరము వూని భక్తవత్సలుని శంకరునిఁ బార్వతీపతిని మదిలోఁ గుదుఱుపఱిచి మెలఁగుము. ఆపద లన్నియు నణఁగి పోవును. ఇష్టసౌఖ్యములు చెందును. అని బుజ్జగించుచు నాతని నెత్తుకొని పోయి కువలయ సౌరభ యుతులు గుబాళించు చల్లని నీట మేనెల్లఁ గడిగి తనివి తీర నీరు ద్రావించి కనుదోయి తడిపి చైతన్యము సమకూర్చి తా నుండు గుహాలోనె యాతని నునిచి మొదవుల పాల నాతనికి జవసత్త్వము లొదవించుచుఁ గాలుసేతులు కలుగు తెఱవును గరుణ మీఱ నారయుచుండెను.

ఇంతలో వెలుంగులు తొలంగుచుండ వింతగాఁ జందురుఁడు వెలవెలఁబాఱెను. చుక్కలు తల చూపక యెక్కడి వక్కడ నణఁగి పోసాగెను. గృహాంతర దీపముల కాంతులు కృశింపఁ జొచ్చెను. కుక్కుట కంఠ కాహళు లెల్లయెడల మొఱసెను. పులుఁగు లన్నియుఁ బొరిపొరి నెలుఁగించుచు గూండ్లు వెడలెను. పరిమళములు గ్రోల నిటునటు భ్రమియించు భ్రమరములు పిల్ల తెమ్మెరలు వీవ ఘనదీర్ఘి కలలోఁ దరంగముల నూయెల లూఁగుచుండెను. వెన్నెల బయళ్ల హంసతూలికా తల్పములఁ బరున్న ధన్యులు ప్రత్యూష పవనాంకురముల కలరియుఁ దూరుపుఁ జాయ కెంపెక్కుట కుస్సురనిరి. అంతఁ దిన్నగాఁ దీరిచిన లత్తుక రేఖయో యన బాగుగ జిగిమించు పవడంపుఁ దీగెనా రాగిరేఖ చందమున జేగురుపట్టె సొబగున రాముని గండ్రగొడ్డలి వడువున నాత్మమండలం బెల్ల నలరారుచుండ శచీదేవి చెవిని జెలువారు

కెంబసిఁడి యాకువోలె నసురులపై నలుకను జలశాయి వేసిన చక్రమన్న నరణిఁ గములబాంధవుఁడు జక్కవల సొంపు వ్రతముల చేవ కైవల్యముత్రోవ తూరుపుఁగొండను దోఁచెను.

రాజనుహేంద్ర భూపతి యారీతిని దొడ్డ గోనములఁ బేర్వాఁచిసిన బిడ్డను దండింపఁ బంపి రెప్పలు వ్రాలి నిద్రింపఁ జొప్పడక యారటమున నూరక నిట్టూర్పు లూదవఁ బొన్పన వేఁగునంతకుఁ బొరలి పొఁరలి మేల్కాని వచ్చినవడువున వచ్చి కాలకృత్యములు సల్పి కొలువున కేతెంచి కొండ విఱిగి మీఁదఁ బడ్డభంగి నేదియుఁ బలుకక యట్టె యుండెను. నగరి రక్షకులంతట నేఁగుదెంచి నిగనిగలు మెఱయు సారంగధరు నగలు తెచ్చి ముందిడి త్రేచి యడుగుఁదమ్ములవ్రాలి యట్టె యావురు మని యేడ్చుచు నాకాశవాణి పలికిన దంతయు విన్నవించిరి. ఖేఁదును విస్మయం బొదవ వెఱపు చిత్తమునఁ దట్టుముట్టాడ మంత్రివరులను మహీసురులను జుట్టపక్కములను రావించి తనవెంటఁ గొంచు నంతిపురి కరిగి యా చిత్రాంగిని రప్పించి సామవాక్యములు తగవని పెలుచదనముగ నదలించి బెదరించి, కాదు లేదని కల్లఁబొల్లులు వలుకు నా కాంతకుఁ దలవరుల మాటలు కొలు వెల్ల విస్మయం బంద వినిపించి నిక్కమ్ము చెప్పుమా యని నొక్కి పలికెను. అప్పుడు చిత్రాంగి జంకక గొంకక నొక్కక గ్రుక్కక నిబ్బరము పూని దిట్టతనము దీపింప నిట్టులు వచించెను:— ప్రభూ, రత్నాంగిదేవి తలవరులకు లంచ మిచ్చి యాకాశవాణిఁ గల్పించి ప్రియునిఁ గనుఁబ్రొమి తనయున కాపద తలఁగఁద్రోసి దురుక్తులు కొన్ని యెన్ని నన్నుఁ జంప

బన్నిన నాటకం బిది యనుట తేట తెల్లము. మానవనాథ,
యది కాదేని ధాత్రి పలికిన యాకాశవాణి నేఁ డెందరిగెను?
అనుడు తత్క్షణమ యశరీరవాణి యిట్లు వినవాయెను:—
రాజేంద్ర, రూపనిర్జిత మారుని నీ కుమారుని మోహమునఁ
జిత్రాంగి తెప్ప లార్పక చూచిచూచి బతిమాలి నీతి మాలి
ధృతి దూలి తత్తరంబునఁ బట్టుటకుఁ దమకించిన నాతఁడు
పాపమ్మని పోపొమ్మని త్రోచిపోయిన నలిగి కొనగోళ్ళఁ
దానె చనుగుబ్బలు వ్రచ్చికొని కుమారుని చేఁతగా నీకుఁ
దార్కాణ యని చూపెను. ఆమె చేసిన బూమె లెల్ల
నిక్కము లని నీ వెంచి దయమాలి పగవానిఁబోలె నిరప
రాధు సారంగధరుని బట్టిని బట్టి కోయించి పాతకము
మూటఁ గట్టితివి. ఛీ! నీతోడఁ బల్కఁగాదు. అని యూర
కున్న నా తేఁడుల్లమునఁ బెల్లుగ దురపిల్లి శోకమున మూర్ఛ
వోయి కొంత తడవునకుఁ దెలిసి గొబ్బునఁ గన్నుగవ నశ్రు
వులు జాలువాఱ నా పాపబుద్ధిని జిత్రాంగిని బరికించి క్రోధా
నలము మదిలోఁ గుదురుకొని దరికొనఁగా నిట్లు పలికెను.—
ఓసీ! పాపజాతీ, నినుఁబట్టి నాపట్టిని నిర్మలచరిత్రుని నిరప
రాధుని సాగరగంభీరునిఁ జంపుకొంటిని. పరమేశు వరమునఁ
బడసిన పుత్రరత్నమును బోనాడుకొంటిని. ఆలి మాటలు
చెవుల దూర నాలించి యీలీల బిడ్డను గోయించెనే
యంచు భూజనులు నన్ను బ్రువ్వఁదిట్టరే! పాపఁగరాని
పాపము చేపట్టి నారకపంకానఁ గూలిపోయితిని. అని చిం
తించు రాజేంద్రు నూఱడింపను బొంకను మదిలో నుపా
యము గానక కాల్రివేల నేల వ్రాయుచు నూఱకున్న

చిత్రాంగిని బాతాళవివరమును బోలి లోఁతు మిాఱిన నూతిలోన ద్రోయించి మాయించి శోకవేగమున నేదియుఁ దోఁపగ నేలపైఁ బొరలుచు సారంగధరుని రూపురేఖలు గుణగణములు పలుమాఱు పేరుకొనుచుఁ బలవింపుచుండెను.

అంత మతిమంతుఁడు మంత్రిసత్తముఁడు ఱేని వైఖరి కాంచి యిట్లనియె:— ప్రభూ, యీలీల నీవు మానంబు దొరఁగి సంతాప మందఁ జనునా! చేసిన చేఁతలకు రోదనము సేయుట గతజల సేతు బంధనంబు. లోకులలో నింద నొంద వలసియుండి నా చెప్పిన బుద్ధి చేకొనవైతివి. పరమేశు వరమునఁ బ్రాదుర్భవించిన పరమపుణ్యుఁడగు సారంగధరుఁ డేల హానిఁ బొందును? తప్పక శుభంబు లాతఁడు పడయ వచ్చును. నావిని జే.డాతనిఁ గనుఁగొని యన్నిగతుల నీవు కార్యంబు పుట్టఁ జెప్పఁగ విననైతివి. పాప మెంచక పట్టి నూరక పట్టి కోయించితివి. నా నేరమి మాట యటుండె. పరమేశ్వరు కృపచే నాబిడ్డ చావకుండినఁ జాలు. వేవేగ నాతని గొనితెచ్చి వెజ్జులఁ బెట్టి నిచ్చలు మోళ్లు గాపించి యెట్టులో బ్రదికించుకొని వానికిఁ బట్టంబు గట్టి యడవులకుఁ బోయెదను. అని పలికి రత్నాంగియుఁ దాను బంధుమిత్రులతో బయల్వెడలి నగర రక్షకులు ముందరఁ ద్రోవ చూపఁ బొగులుచు నేఁగుచు నొక్కెడఁ గట్టెదుర నెత్తుటఁ దడిసిన వధ్యశిలమీఁదఁ ద్రుంచిన కాలుసేతులను గాంచి నందనుని గాంచక కడుపు భుగుల్లున నడలుచు హా పుత్త్రా యని మూర్ఛవోయెను.

రత్నాంగియు నట్టులె నేలఁ బడి కొంతవడికిఁ దెలిసి యడుగులు తడఁబడ నశ్రువు లురలఁ బొంతను బొదరిండ్లను భూరుహములను గొండకోనలను గొలకుల చెంగటను బుత్త్రి నెలుంగెత్తి పిలుచుచు వెదకుచుఁ గానరే తరులార నా పట్టిని గాంతావనోజుని జూడరే గిరులార నాసుతుని సుగుణభూషితుని మునులార మీరైన నెఱుంగరా మా సారంగుని నని విభ్రాంతిమెయి నోరు నొవ్వ నొడలు చెమరింపఁ గుత్తుక యెండఁ గ్రుమ్మరుచు భర్తయుఁ దాను జనుదెంచి యా కాలుసేతుల ముక్కల నక్కునఁ గదియించుకొనుచుఁ బలు తెఱంగులఁ బ్రలాపించుచు మక్కువ నెక్కొన నోరా! చిన్ననాఁడు నిన్నెలమిని నోరార నడుగిడు మన్న నీ యడుగు లివియా బాబూ, తటుకున రమ్ము నా తండ్రీ యనఁ జిటికెలు వెట్టు నీ చేతు లివియా బిడ్డా, గోమునం జన్నిచ్చి నా పోషిన మేని నెత్తురా యీ క్రొన్నెత్తురు పుత్త్రకా! క్రొత్తావి గుబాళించు పన్నీటఁ దల యంటిన నీ వెండ్రుకలు నేఁడిట్టులు నేలఁ గలఁసెగా! పేద సాదులకైనఁ బుట్టె పెక్కేండ్లు మనక రారాజు కడుపునఁ గలిగి లేఁబ్రాయమందె సర్వసామ్రాజ్య సంపదలఁ బాసి కాఱడవిలో నీగతిఁ జావ వలసి వచ్చెనా! అదనున నిక్కము చెప్పక యశీరవాణి తుదకి బలికిన నేమి పలుకకున్న నేమి! చలము పట్టి నా పట్టిని గోయించి చంపి పంతము చెల్లిన చిత్రాంగి చచ్చిన నేమాయె! భామిని మాటలకు భ్రమియించి నిన్నుఁ దఱిఁగించిన నీతండ్రి నిన్నుఁ జూడ వచ్చెనే యని డాఁగితివో! కాక వాల్మీకములు కఱచికాని యొండెడకుఁ గొంపోయెనో! నట్టడ

వీలో భయంకరలీలం గ్రాలు భూతములు నినుం బట్టి పొట్టను బెట్టుకొనెనో! తలవరులు తమ పని తీర్చి యొక్కని డించి యరుగ భీతిల్లి వాపోవు నిన్నుం గరుణించి యెవ్వడైనం గాంచి చేపట్టి పోషింపం జూచెనో! తనయా, నిన్నేరీతిని మఱతును! ఒప్పిన నీరూపు చొప్పు వినయవిధేయతల వైఖరి నీ నెయ్యము నీ చారిత్రము మఱపునకు వచ్చునా తండ్రీ! అంచుం బల వించు రత్నాంగిని గాంచి ఖేదమును వినువారి కేస్పు రా నిట్టులు విలపించెను.

వత్సా! యేమని యేడ్తును రా! ఈ పాతక మేమని తలపోసెదను? ఎటం బోయితో! ఏమని నన్నంటివో! ఎందు న్నాండవో! ఎన్నండు చూతునో నిన్ను! ఆ మహాదేవుని జిర కాలము సేవించి కోరిక మీరం గన్న నిన్ను దేవతాసమునిం దెలివి మాలి దూఱి, మతిమంతుని మాటయు వీటం బుచ్చి కొఱగాని చేతలు చేసి లోకులు నవ్వం గడుపునం గొఱవి నుంచుకొను పిఱికి నైతిని. ఒప్పును దప్పును బిదప విచా రింతు నని చెఱలో నుంపనైతినే. అదరి బెదరి లాంతి విలాం తికిం బారిపోవునట్లు కోపింప నైతినే. వేగపడి పని తీర్చు వెంగలి నాపదలు చుట్టుముట్టు నన్న నీతివాక్యము మదిలో నిలుపనైతిని. నా తాల్మి తెగటాఱె. నా తెలివి యణంగిపోయె. ఇందు నందు నమందసౌఖ్యములు వొందించు పుత్రు లెందును బుట్టరుగాని నిమిషార్థ సౌఖ్యము లొసంగు నీరజాక్షు లెందైనం గలరు. ఇది మదిలోం దలపోయనైతిని. పట్టీ నీవు లేనట్టి యీ రాజ్యమేటికి! ఈ తను వెందులకు? అసువును బాసెదను. అని బరువైన ఱాయి మెడం గట్టికొని యేటిలో లోంతు నీటి కరుగ

నాకాశవాణి యిట్లనియె:— ఓహో! రాజా, యిదేమి సాహసము? పరమేశ్వరుని నందనుండగు మీననాథుని యొద్ద నీ బిడ్డ పొందగా సఖ మున్నాఁడు. అతనికి దేహసిద్ధియు దొరకను. కాలసేతలును గలుగును. పరితపించుట మాని పట్టణమ్మునకరుగుము, నా విని యందఱి ప్రమోల రాజును రక్షింగియు శోకం బెడఁబాసి పురమునకు విచ్చేసి రాజ్య మేలకొనుచుండిరి.

అచ్చట మీననాథుఁడు రాకొమరు నొక్కరొడఁ బదిలముగ నుంచి గోపాలుఁడు భక్తితోఁ దెచ్చియిచ్చు పాలు వోయుచు నతని కధ్యాత్మవిద్య నుపదేశింప దొడఁగొని సిద్ధాసనాసీనుం గావించి యోగాదికములు పెక్కు లెఱింగింప నాతఁడు గురునాథుని వాక్యములు చిత్తమున హత్తుకొన మెలకువ కలిగి మేలొంది యోగసౌఖ్యము లనుభవింప సాగెను. ఆలీలఁ గొంతకాలము గడువను గురునాథుఁడు భూనాథుసుతని కాలుసేతులు కలిగింపఁ దలంపుకొని యోగ మార్గము లెస్సగ బోధపఱిచి మెలంగుచుండ నాతని భాగ్యంబు కతన మొండిగా నున్న కాలుసేతులలో మొలక లలరి క్రొమ్మొనలెత్తి వ్రేళ్లు గోళ్లు విస్తరించి నాఁడునాఁటికిఁ బోఁడిమి వెలయ నాథముఖ్యుఁ డద్దాని కుల్లము పల్లవింపఁ దొల్లింటికంటె నొడికమై వాడుకలో పస మీరఁ జేయుదు నని యెంచి భక్తితో నీశ్వరుని బ్రస్తుతించి యాతని నిలమీఁద వల్లన దించి చంకలక్రిందఁ జేతులు గ్రుచ్చి పట్టి మెల్లన నెత్తి యడుగులు నేలను బెట్టింప రాసుతుఁడు దిటవు మిగుల నూఁది నెమ్మదిగ నడయాడసాగెను. ఇట్టులు నానాఁడు సిద్ధనాథుఁ

డాతనికిఁ జేయూఁత యొసంగుచు గుహాభవనములోనె కొంత దవ్వు నడపించుచుఁ గరుణ మీఱ నాతనికి సిద్ధులెల్ల నొసఁగి కృతార్థుని గావించెను. మొండివగు నాలు గంగములు రంగ వర్ణంబులై మొలచుటను చౌరంగి యని నామ మొసంగి సిద్ధనాథుఁ డాతని కిటు లనియె:— తనయా, నే నిఁక మాల్య వంతంబునకుఁ జనియెద. అమ్మహాపర్వతమ్మునఁ బ్రజ్వలించు దివ్యౌషధములు చిత్రవిచిత్రములు మాకుఁ జేపడును. ఒక్క మాట. నిచ్చలు పాలు తెచ్చు మన గోపాలుఁడు గురుభక్తి నిరతుండు. ఇన్నాళ్ళు పాలు వోసి మన యక్కఱ తీరిచె. ప్రేముడిచూపిశిష్యునిగా నాతని భావింపుము. ఆతని కవశ్యము యోగిత్వ మొసంగవలయును. అట్టి గుణవంతునకు నియమవం తునకు మసలక మా యానతి నుపదేశ మిమ్ము. అనుచుండ నావుపాలు గొంచు నచ్చటికే చెచ్చెరగోపాలకుఁడువచ్చిదుగ్ధము లిచ్చి భక్తితో నిలిచియుండెను. పరమ యోగీంద్రుఁ డాతని యెడఁ గరుణామృతము నిండఁ గడగంటి చూపు లొలయ నోయీ, యౌషధము లందుకొనుటకై మాల్యవంతమ్మున కేము కదలవలయును. తొంటియట్ల నిచ్చలు పాలను దెచ్చి మమ్ముఁబోలె నీతనిఁ దృప్తుని గావింపుము. ఆవలఁ గ్రమ్మర మేము వచ్చి వివిధ యోగాభ్యాసము లెఱింగించి తను సిద్ధియు నొసఁగి ధన్యునిఁ జేసెదము. ఒకవేళ మారాక యాలస్య మైనచో నీతఁడే నీ కుపదేశ మిచ్చును. ఈతని సుస్థిర భక్తి ప్రపత్తుల సేవింపుము నీవని చౌరంగి కాతని నప్పనసేసి వేవేగ గోపాలుని వీడుకొలిపి లాతపుఁ గోలయుఁ బుటికయుఁ గేలఁ బూని బాలేందుశేఖరుని మదిలోఁ గీలుకొలిపి యాగుహ వెడలి

యరిగి యరిగి పల్లెలు పట్టణములు కొండలు కోనలు నదులు పొదలు తీర్థములు క్షేత్రములు చూచుచు సేవించుచు నాకేశ మత్స్యేంద్రుఁడు మహనీయ రత్నరాజితోత్తుంగ శృంగ సంగతంబై యాకస మంటుదాని ఘన దంతి హరి సింహ ఖరనఖోత్పాత ముక్తావళి యుక్తమై వెలయుచుదాని శాఖామృగ వ్యాఘ్రాత వృక్షశ్రేణి కలదాని విశ్రుత లతాంత విభూషితానంత శిఖరము లొప్పుదాని కిన్నర కింపురుష గరుడగంధర్వవిహార కేళికి ననువగుదాని మహామహిమోపేత మగు మాల్యవంతముం జూచి డాయఁ జని చిత్తమునఁ గౌతుకంబు హత్తుకొన నన్నగ మొయ్యన నెక్కెను.

అందు ముందున్న సన్మునులు మోదంబు మదిఁగోఁబొదలఁ బరమేశ్వరుని నందనుండు మీననాథుం డరుదెంచె నెదురుగా నరిగి యాతనిఁ బొడగందు మంచు గుంపులు గుంపులుగ వచ్చి తనివి తీఱ దర్శించి శ్రద్ధయు సన్నుతులు సేసి ముకుళితహస్తులై ముందట నొదిగ యుండిరి. వారి నెల్లరను జల్లని చూపులఁ జూచి ప్రేమునఁ గౌఁగిటఁ బొందించి యందఱఁ గుశలంబు లడిగి వారు వెంట రాఁ దాను గోరికలు మీఱ నా కొండ నెక్కి హోమాగ్నులు వెలయుచు వేదనాదములు పరఁగుచుఁ బరమశాంతమున కిక్కయిన పర్ణశాలలను గంధర్వ భామినుల చతుర గానములు వీనుల విందులు సేయఁ గలకంఠ శారికా కీర కలకల నాదము లొలయఁ బండ్లతోఁ బూలతో నిండారిన వృక్షములు విలసిల్లు వనములను, గన్నుల పండువు సేయు కమనీయ కమలాకరములను గాంచుచు వినతులై తాపసులు తెచ్చి యిచ్చు నర్ఘ్యపాద్య

ములు పుచ్చుకొంచు నాయాయి తావులఁ దిరిగి తిరిగి వారిని వీఁడ్కొని యటనట వలసిన మందులు మూలికలు సేకరించి యక్కొండపై నొక్కయెడ గుహాలో వసించుచు యోగానంద మగ్న మానసుఁడై కాలము గడపుచుండెను.



# ద్వితీయాశ్వాసము

## చౌరంగి వృత్తాంతము

అచ్చటఁ జౌరంగియుఁ గాలుసేతు లొడికమై వాఁడుకకుఁ దగియుండ సంతోషమున గుహ వెపలి రొకనాఁడు చెంగటఁ దెరువున నొక పరపైన ఱాతిపైఁ గూరుచుండెను. అత్తఱి నుత్తముండగు వైశ్యుఁ డొక్కఁడు మిర్యముల మూటలు పెక్కులు పట్టించికొని పోవుచుండఁ గాంచి చౌరంగి యివి యేటివి యెక్కడికిఁ బోవుట యంచుఁ బ్రశ్నింప నతఁడు సుంకరి యని భీతిని సుక్కి నేర్పున బొంకి తప్పించుకోవలె నని యెంచి యవి జొన్నలంచుఁ బలికెను. ఆత్మలో నయ్యవి జొన్నలే యని చౌరంగి దలంప మిర్యపు మూటలన్నియుఁ జిత్రముగ జొన్న లయ్యెను. వర్తకుఁ డంతట నొక్క పట్టణము చేరి యా మూటలు విచ్చి చూచి యచ్చెరువడి బొంకినదాని నూహించి యా పుణ్యాత్ముని సుంకరి గా నని మొఱగి మోసము చేయుట నీ చేటు వాటిల్లె నని యెఱిఁగి క్రిమ్మఱ నాతని దరిఁ జేరి వినయమున వేఁడుకొందు నని నిశ్చయించి మూట లెత్తించుకొని యాతఁ డచ్చటికే చనెను. చౌరంగియు నివి యేటివన వాఁడును నవి మిరియమ్ము లని నిజ మాడిన నా సిద్ధుఁడు తన మదిలో నట్లే భావించెను. చెచ్చెర నచ్చెరువుగా నా జొన్న లన్నియు మిరియములై తొల్లింటిపోలె నుండెను. అవి గాంచి వర్తకుఁడు వెఱఁగంది యా మహనీయునకు భక్తితోఁ జాఁగిలి మ్రొక్కి

స్వామీ నీ వాక్యము దేవతావాక్యమే యంచు నత్తెఱం గంతయు విశద పఱిచి వీడ్కొని యొంటని నరిగెను.

చౌరంగి తనకు వాక్సిద్ధి యగుట యెఱింగి తక్కటి సిద్ధు లన్నియుఁ దనకుఁ గలిగె నని తలంచి మున్ను గురువు మ్రోలఁ జేసిన శపథము చెఱచి నిచ్చలు పాలు తెచ్చి తన్నుఁ దృప్తుని జేయు గోపాలుని మాట వీడి మత్స్యేంద్రుఁ డరిగిన త్రోవను గొండలు నదులు పురములు పల్లెలు తీర్థములు చూచుచుఁ బోవుచుండెను. తొల్లింటివోలె దుగ్ధభాండంబుతో గొల్లండు వచ్చి గుహ వాకిట నిలిచి పాలకుండను లోనికిఁ జాపిన వెనుకటి జాడ కానక లోనికిఁ జొచ్చి యందందు వెదకి యాదటఁ జౌరంగి నరసి యరసి తుదిని గానక వేదన పొంది వెలికి వేతెంచి గుహ కావల నీవల నంతటను వెదకుచు నెలుఁగెత్తి పలుమాఱుఁ బిలుచుచు నెవ్వగ నివ్వటిల్ల నిట్లని తలపోసెను:— ప్రేమార ననుఁ బిలిచి గురుఁ డొప్పగించి చన్నది మొదలు నిచ్చలు పాలను దెచ్చి యిచ్చుచుండ నేఁడు గైకొనక యీతఁ డెక్కడి కేఁగెనో! మెకములు వట్టి యీతని ప్రాణము లేమైనఁ గొంపోయెనా! భూతంబు లేవియైనఁ బొట్టను బెట్టుకొనెనా! తెరువు దప్పి యెందేనిఁ దెలియక యరిగెనా! ఎచ్చటను గానరాఁడె? పంచభూతములు సూర్య చంద్రులు పరమేశ్వరుఁడు సాక్షులుగా గురువని చౌరంగిని నిత్యము కొలుతునె! గురునాథునికి మాఱుగ నఱలేక యనారతం బతనిఁ దలంతునె! నా యెడ లవలేశము దోసము లేదె! అని విన్నంబోయిన మోమునఁ గన్నీరు తొరఁగుచుండ వెదకి వెదకి తుదికి విసిగి

వేసారి వెడలి యాలమందను జేరి గోపాలురను బిలిచి యా పసిని వారికి నప్పగించి చావ సమకట్టియు జాలిని గుము చులుఁ దా నుండు గుడిసెలోఁ బడియుండి యొక్కింత కను మూసెను. అంత మీననాథుఁడు కలలో నరుదెంచి వత్సా! చావ నేటికి? చౌరంగి యిచ్చటికె వచ్చియున్నవాఁ డనుడు దిగ్గన మదిలో నాతనికి మొక్కి యద్దానికి వెలఁ గంది మఱునాఁ డరిగి మత్స్యనాథుఁడు వసించు గుహావాకిట నిండుగ పూలను బెట్టి శిష్యుల భక్తితో నిహపరంబుల గురువే దైవ మని భాషించి యుండెను.

చౌరంగియు నటులేఁగి మాల్యవంతంబు చెంత వడ దాఁకి దప్పిగదిసి నీరు వెదకుచుఁ బోయి పోయి కమలేందీవర షండ మండితమ్మయి సారస హంస చక్ర ప్రచారము కలిగి పంకదూరమయి మధుర పానీయ పూరితమై సద్వీచీ వితాన సారమై చెలువారు కాసారము కాంచి మనంబునఁ గౌతుకంబు గదురఁ దామరపాకు దొన్నెతోఁ జయ్యన నందుఁ జొచ్చి నీరు నించి త్రావినను దప్పిక తీరదయ్యె! అంతటఁ దనుఁ గాంచి దొడవ్వులఁ దొలఁగు పక్షి మృగ సంతతులను వీక్షించుచు సహకార భూజంబు నీడలో సైకత స్థలమున మార్గాయాసంబు దీఱ మెల్లన శయనించి కొమ్మలలో నిమ్ముగ వసియించి కుహూకుహూ యని పలుకు కలకంఠ ముల కలకల ధ్వనులు వీనుల విందులై పొలయఁ బలు మాఱు వినుచు సుఖముగ నుండెను.

అవ్వేళ నయ్యెడ కొక్క పాపఱేఁ డొయ్యనఁ జను దెంచి కాసార తీరమందలి పాదప మెక్కి తోఁకను గొమ్మ

లలో దిటవుగా మెలిపెట్టి డప్పికమెయి సరసిలోనికిఁ దల
చాఁచి నీరు త్రావుచుండ నందుండి నెగడొకఁడు నిగిడి
తివిరి యద్దానిఁ బట్టి వదియుఁ దోఁక వదలక బలిమి చూపెను.
ఇటు లారెండును బట్టు వీడక పెనంగుచుండ వృక్షము
వేళ్ళతోఁ దోడిఁబడఁ బెకలి యానీట భోరున బుగ్గలు వొడమ
మునింగెను. నీటి జంతువు బలిమికి సిద్ధుఁ డచ్చెరువడు
నంతలోఁ బాము దానిని గఱచి విడిపించుకొని చెట్టుతో
నీటఁ దేలి మీఁదికి వచ్చి మిక్కిలి యలసి యాఁకొన్నదగుట
నొదుఁగుచు మెలఁగుచు నా సిద్ధునిఁ గాంచి యారాట మొల్ల
మాని పడగ యెత్తి నిక్కి, యయ్యా, మీరెవ్వరు? ఏమో
పనిగా నిచ్చటి కేపగిదిని వచ్చితిరి? ననుఁ జావకుండఁ గాచి
తిరి అనినఁ జౌరంగి సర్పరాజమున కిట్లనియె. బ్రహ్మ
మహేంద్రాది దేవతా నికర భాసుర మకుట మణిబృంద
రంజిత పాదపీఠుండై పరిఢవిల్లు పరమేశ్వరు గారాబుపట్టి
మీననాథుఁ డను సిద్ధనాథున కేను శిష్యుఁడను. రారాజు
బిడ్డను చౌరంగి యను సిద్ధుఁడను నా గురుదేవుఁ డీమాల్య
వంతంబున క్షేమంబున వసియించి యున్నవాఁడు. వారి
పాదకమలములు సేవింపఁగోరి యిట కేతెంచి డప్పిగొని
నీరు త్రావ మడుగును జేరి యీ చెట్టునీడలో నెమ్మది
వసియించి నీ యీ కథ నెల్ల మెల్లఁగఁ గాంచుచున్నాను.
అని చెప్పి నీవు కైకొనఁ దెచ్చిన మందిదిగో యని యొండి
చ్చిన డెందమ్మున మోద మ్మందిన యురగ మయ్యా, పర
మేశ్వరు పుత్త్రుఁడైన మత్స్యేంద్రుని శిష్యుఁడ వగుట నిత్తు
నీచే గొను మని యామణి యొక్కటి యొసఁగి, మత్స్యేంద్రుని

జూడను నా మన మాగాటము చెందుచున్నది మొదలు నేనొక గంధర్వుఁడను. ఒకానొక శాపమున సర్పవేషము గైకొని యిటు లైతిని. అమ్మహానీయుని జూచినప్పుడే శాప మోక్షమ్ము కలుగును. సరే చూతము పోయి రమ్మనుచుఁ బామును వీడ్కొని చౌరంగినాథుఁడు ముందున కరిగి మాల్యవంతమ్మును గాంచి చల్లని పిల్లతెమ్మెరలు వీవ నా శైల మల్లన నెక్కి యందలి యోగిబృందమ్మునకుఁ దనరాక యెఱింగించుచు వారొసంగు నాహారము గైకొని గురునాథుఁ డున్న గుహాలోని కరిగి పరమ యోగానంద జలధిలో నోలలాడుచున్న యోగివరేణ్యుని దర్శించి భక్తిప్రపత్తిని జాఁగి మ్రొక్కి కేల్దోయి మొగిచి, ఆశ్రిత పారిజాత, ఓహో గురునాథ, యోగిజన వంద్య, యోగ విజ్ఞాన సాగర రాకాసుధాకర, భోగిభూషణ పుత్త్ర, భువనైక వినుత, సంసార దూర యని వినుతింప నా మహాత్ముఁ డది తెలిసి చాఁగి మ్రొక్కిన శిష్యునిఁ జయ్యన లెమ్మని కరుణింప నాతఁడు భక్తి సంధిల్లఁ బామొసంగిన యౌషధంబు గురువునకుఁ జూపి యక్కథ యంతయుఁ జక్కఁగఁ జెప్పి, స్వామీ, యాతఁడు దివ్యౌషధ లాభంబు తెలియఁ బలికి యటకు మిమ్ములను రాఁ బ్రార్థన చేసె అని పలుక ముదమంది, యోగీ, నీకు యోగవిద్యాభ్యాస మొనరించి వచ్చితిమి. కాలుసేతు లిమ్ముగ నుపకరించుచున్నవే! ఆ తెఱంగున మమ్ము ననారతము భక్తితోఁ గొలిచియున్న గోపాలముఖ్యునకుఁ గుశలమా! యనుడుఁ జౌరంగి స్వామీ, మీ మహామహిమను బాణిపాదములు చక్కఁగఁ బడసి దివానిశము యోగాభ్యాసము నేమరక

యనుష్ఠింతును. పుణ్యాత్ముఁడు గోపాలునకుఁ గుశలమె. అని పలికెను. అదివిని యోగీ, నీవిందు వచ్చుట యాతఁ డెఱుంగునా! నా చెప్పిన చొప్పున యోగవిద్యోపదేశ మాతని కొసంగితే యని గురునాథుఁడు ప్రశ్నింపఁ జౌరంగి గడగడ వడఁకుచు వాతెఱ భీతిని దడువ విన్ననై తల వాంచి స్వామీ, యాతనికిఁ జెప్పకయె వెడలి వచ్చితిని. ఈ తప్పు సైచి చిత్తమునఁ గరుణ చిప్పిలఁ గటాక్షించి నన్ను రక్షింపవే యని వేఁడుకొను మాటలు వీనులకు ములుకులయి యుల్లంబు పెల్లుగఁ గలఁగి బిట్టులికి కన్నీరు దొరుఁగఁ బేర్చిన దుఃఖమున మీననాథుఁ డిట్లనియె. నా యానతి మీరి నీవాతని నొక గొల్లండని మాత్రమె భావించితివి. అట్టి సుకృతాత్ముని శుద్ధచరిత్రుని గురుభక్తినిరతుని గుణగణ భూషితుని బరహిత వ్రత లోలుని బరమ కల్యాణుని వంచించి వచ్చుటకు నీకుఁ గాళ్ళెట్లు లాడెను! ఇంచుకైన మనమున నీతిలేదె! ఆతని నమ్మించి చెఱిచిన పాతకంబు నిన్నుఁ జుట్టుముట్టదా! తెఱవ మాటలు నమ్మి నందనుండని యెన్నక నట్టనడురేయి కాలుసేతులు కోయించిన కఱకుగుండె గల నరపతి సుతుండగు నీ కేల కనికర ముండును! వేమునకుఁ బాలు వోసి కప్పురమునఁ బాదు సేసి పసిడికొప్పెరలోఁ బన్నీరు తెచ్చి ముచ్చటగాఁ బోసినను వెనుకటి గొనములు మానునా! తమ యక్కఱ తీరుదనుక క్షత్రియులు మిత్త్రులవలె మెలఁగి నమ్మిక పుట్టఁజేసి యచ్చి వచ్చినవేళఁ జెచ్చెర నొకకీడు చేసియే పోవుట వారి వాలకము. నీచుఁడా, నిచ్చలు నీకుఁ బాలు

తెచ్చి యేచిన సద్భక్తితో నిచ్చి మనసారం బోషింపం గర చరణములు కలిగనే యుని యాతని మేలు గుఱుతింపక యేమని మొఱంగితివో! నీ మోము నేనేమని చూతును. హోహోమ్మ. నినొంచిన ఫల మెల్ల నాపాలం బడియెను. నాపాల నింక వసింప వలదని గోపాలుని మానమునం దలంచి, ఓయీ సజ్జనుఁడా, గురుభక్తి మెండుగ నుండువా రిలలోఁ బెక్కండ్రు కలరు గాని నీవంటి శిష్యు నెవ్వలనను గానము. గారాబున నిన్ను శిష్యుగా నొనర్చుకొను మహాభాగ్య మేటికిం జారంగి కబ్బును? ఈ పాపకర్మం డుపదేశ మీయక నన్ను మొఱంగి వచ్చిన జాడ నీనెఱుంగనేరక గుహాగ్రోన వెనకి వెదకి యెంత విభ్రాంతి నొందితివో! ఎచ్చటం జరిగితివో? ఎచ్చట వగచితివో! ఎచ్చోట నిన్నుం బోడ గాంతునో! అచ్చోగ నిప్పుడే వచ్చి యోగము నొసంగెదను అనుచు దిగ్గున లేచి పయన మగు మీననాథుని పాదములం బడి చౌరంగి స్వామీ, క్షమింపవా! భవదీయ కోపముల పాపములను గొల్వను దనుక పడి నీపంపు మఱచి వచ్చితిని ఈ తప్పు మన్నించి కోపంబు దక్కి ననుం గైకొని తొంటిరీతిం గరుణ వీక్షింపవే! కరుణ లేక జనకుం డారిత్రిని గఱకఱ గోయింప ననగుచున్న నన్ను దయతో మనిచితివి నీ మహిమను గర్జింప శేషు డును జాలం డన్న నాబోంటి యెంతటి కయితి యగునె! నా స్వామివి నీవె. నా తల్లివి నా తండ్రివి నీవె. అని పలుమారు మొఱ వెట్టుచుం జాంగిలి మ్రొక్కుచున్న యతనిని సైంపక యలుక చాలింపక యోగివరేణ్యుం డోయీ, నీవొనర్చిన కల్లతనము పదివేలు చెప్పినను నా యుల్లమునం బాయదు. పాపాత్మ,

నీవు నా పంపు కాదని తొలఁగి వచ్చితివి. అక్కటతన నీ నేర మికి సంతానహీనుండ వయి చింత నొందు మని శాప మొసంగెను. అంత జనసత్త్వము లడంగి తాపము దీపింప గురునాథు నడుగుఁదమ్ముల వ్రాలి కన్నీరు మున్నీరుగఁ దొరుఁగ మగుడ లేవక స్వామీ, బడుగు పిచ్చికమీఁదఁ బాశుపతాస్త్ర మాదరించునట్లు మదిలో జాలి వడక దీనాత్మ నీతని నెంతటివానిగాఁ దలంచితివి. శాప విరాయ నాయనూ యని మాటిమాటికి కావనుఁడయి పలవించు చౌరంగి నొక్కింత కనికరించి కాంచి పుత్త్రికా, నేము నీకిచ్చిన యోగవిద్యయుఁ గాయసిద్ధియుఁ దప్పక నిలిచి యుండును. సిద్ధసంతతి మాత్రము నీకు లేదు. కాని యెచ్చోనైన నఱికి వైచిన మహీరుహము నీవు పాతిన జగతిపై నీసంతాన మనఁగఁ బరఁగు ననుచుఁ జౌరంగి నూరార్చి సమ్మోదము గావించి మును వచ్చిన మార్గమున నరిగి యరిగి తొల్లింటి కొండగుహాగ్ర వాకిట నున్న ఱాల నన్నింటిఁ బుచ్చి పోవైచి లోపలఁ జొచ్చి కక్షపాలయు దండము నచ్చట నిలిపి నిర్మల స్ఫటికోపలముల వెన్నెలల నిగ్గులు దులకించు నొక్కచోట నాసీనుఁడయి గురుభక్తి నిరతుండగు గోపాలు నెన్నఁడు గాంతునా యని మనసు నూర నెదురు కనుచుఁ గాలము గడపుచుండెను.

గోరక్ష సిద్ధుని కథ

అంతట నిచ్చట గొల్లండు గురువును గానక కొండల మందుచుఁ జిన్నవోయిన నెమ్మోముతో నెమ్మన మదుకు గొంగడి ముసుఁగువైచి పసుల కోలయుఁ బాఁకుండయుఁ

గేలఁ గైకొని తలవంచి యున్నగని రెండు దిక్కులు సూడక రివ్వునఁ దొల్లింటి కొండను జేరి గుహ డాసి మొగమెత్తి గురునాథుఁ గనుంగొని యద్భుత హర్షంబులు పొదవ నయ్యా వచ్చెనే యంచు నందె చాఁగిలి మ్రొక్కి యాతని పాదపద్మములు ఫాలభాగమునఁ గదియించి భక్తితోఁ బ్రస్తుతించెను. గురునాథుఁ డత్యాదరంబున నాతనిఁ బిలిచి ముదనూరఁ గౌఁగిలించుకొని ప్రేమూర సేమమే గోపాలశేఖర నీకును నీ మట్టములకు? నీతేజసికి నీపసికి మేలే గదా! ఎల్లరకుఁ గుశలంబె! గురుసేవానురక్త సుగుణ రత్నాకర, చౌరంగి నీకు నుపదేశమీక యూరక మొఱఁగి చపలుఁడై నహా యున్నచోటికి వచ్చెను. అంత నాత్మలో సంతాప మంది నిన్ను సిద్ధుని జేయ నేనె వచ్చితిని. నీదు గురుభక్తికి నీ నడవడికకు నీదు ధర్మబుద్ధికి నీ గోలతనమునకు నిచ్చలో మెచ్చితిని ఇంక నిక్కముగ నాకున్న శక్తిని నీకిత్తు నంచు నక్కడనే యున్న చౌరంగిని బిలిచి యోయీ, నీవితనిఁ గొంపోయి నర్మదలోఁ గ్రుంకు వెట్టించి కొనిరమ్మని పలుకుడు నాతఁడు మారిపమున గురువునకు మ్రొక్కి గోపాలునిఁ దోడ్కొని పోయి యట్లే చేయించి చెచ్చెర విచ్చేసెను.

అంత నా యోగిపుంగవుఁ డాతని సిద్ధాసనమందునిచి మహాదేవుని భోగిభూషణుని మదిలోఁ దలఁచి తన భవ్యహస్తము నాతని మస్తకమునఁ గీలించి యొక్కొక్క మంత్రము నొయ్యన నుపదేశ మొసఁగి పూర్వోత్తరములన్నియు సాంగోపాంగమున నెఱింగించి చిత్తశుద్ధి గావించి శివుఁ డిచ్చిన సిద్ధు లన్నియు నెడసేయక యాతని కిచ్చి సిద్ధు

లలోఁ బ్రసిద్ధునిగా బుద్ధి గఱపి గోవుల నింద్రియమ్ముల విడువక రక్షించుకతన గోరక్షుఁడని యాతనికిఁ బేరువెట్టి యాఁకలి దప్పులు పోకార్చు నౌషధమ్ములను బ్రసాదించి చౌరంగియుఁ దానును సమాధిలో నుండెను.

ఇక్కడ రాజమహేంద్ర భూపతి యంతరంగమ్మున సంతాపమ్మునఁ గుందుచు మతి దూలి తేజు దొఱఁగి రాజ్యమునకు రాఁదగ్గ సంతానము కలుగమిని జింతతోఁ జివుకుచుండెను. బలవంతులగు సామంతులు సాహసవంతులయి యొక్కొక్క దుర్గంబును వరుసగ నాక్రమింప సాగిరి. ప్రజాపీడ మొదలయి యెల్లయెడలఁ బ్రజలు నల్గడ విచ్చి పఱవ జనపదమ్ము లన్నియు జనశూన్యము లయ్యెను. అనర్ఘములగు నాతని భాండారములు మేలగు నాలమందలు సాటిలేని సామజములు పేరుగల వారువంబులు సర్వసంపదలు నెచ్చటి వచ్చటనే చోద్యంబుగ నణఁగి పోయెను. అడవిలో గోపాలవరు నెల్లయెడల వెదకివెదకి తోడిక్రేవలు వగలఁ బొగిలి యదవదను బొందుచు మెకము లాతని మెసవి యుండునని యెంచి మగిడి తమ మందల కేఁగిరి.

కొంత కాలంబు చనఁగ ముందుగ మీననాథుండు సమాధిఁ దెలిసి చౌరంగిని దెలిపి గోరక్షుని సైతము తెలుపుమని పలుక నాతఁ డట్టులె కావించెను. అల్లనఁ గన్నుఁగవ విచ్చి గోరక్షుఁ డెట్టయెదుట గురుస్వామిని గాంచి నే వచ్చి కడు తడవయ్యెఁ బనివినియెద మందలకు నన్నుఁ బంపు మనుడు రాజయోగి చిఱునవ్వు నవ్వి యోయీ, నీ పనులును

నీ వేఁడును నాతని ధన ధాన్యాది వస్తు సంతతులు సర్వమును బోలుపడి పోయి చాలఁగాల మాయెను. పట్టణము నేలఁ గలసె. అచ్చటి ప్రజలు తొల్లింటివారు కారు. అని వారి విభ్రాంతి పోనాడఁ దలఁచి చౌరంగిఁ బిలిచి మీరేఁగి మీపురంబును మీరాజును మీ గోకులంబును గనులారఁ గాంచి రండని పంపెను. వారును సుముఖులయి కొండ డిగ్గి చనిచని జనశూన్యమై పెద్దయు రూపడఁగిన తమ దేశమును గాంచి తద్దయు నచ్చెరువడిరి. చౌరంగి గోరక్షునిఁ గంతయుఁ జూపి రాజసంబున సురరాజును మీరఁజాలిన రాజనరేంద్ర భూపతి యెందేఁగెనో! తిరమై యమరావతిని బుగుడించు మాంధాత పురం బెందణఁగెనో! ఆ పౌరులు నా సంపదలు పురపాలురు గోవ్రజము నెటఁ బోయెనో! ఏమయ్యెనో! ఔరా యీ సంసార సౌఖ్యములు నీటి బుగ్గలకన్నను నిస్సారములు. అని మదిలో రోయుచు నచ్చటచ్చట నయ్యాయి పట్టులు పరికించుచు మనకేల యివి యని పదమూ పోద మని క్రమ్మఱి యా పర్వతమ్మున కరిగి గురువున కెఱఁగి కేలు మొగిడ్చి దేవర దివ్యచిత్తమున భావించిన ఫక్కిని సర్వము కానవయ్యెను. మాకిఁక దుర్మోహంబు తొలఁగెను. అనుటయు మత్స్యేంద్రుఁ డల్లన నవ్వి గోరక్షకా, శరీరసిద్ధులుం దొట్టి సర్వసిద్ధులు మీకు సిద్ధించెను. పరమేశ్వరుఁడు మన్ననతో నొసంగిన మహిమ లన్నింటి నిత్తును. అవి నీవు గైకొమ్ము. చౌరంగి మాకుఁ బ్రథమశిష్యుండు. ఆతఁడు ప్రఖ్యాత రాజ్య భారమును బూని సిద్ధముఖ్యుండయి శిష్యజన బోధకరము లైన యోగశాస్త్రములు పెక్కులు గావింపవలయు నిప్పుడుఁ

చౌరంగినాథుఁడు యోగిశేఖరుని చరణంబుల వ్రాలి స్వామీ, మాకంటెను బెద్దయగు శిష్యుని మాకొఱకుఁ బంపుఁడు. ఆతని నేమరక మిముఁబోలె నిచ్చలు సేవింతును. అనిన నయ్యది యట్టులే యని గోరక్షకా, యీతఁడు మా యానతి మీఱి నిన్ను మొఱంగి తెంపుసేసి మమ్ము సందర్శింపను మాల్యవంతమ్మునకుఁ గ్రమ్మఱి వచ్చుటఁజేసి చాలఁ గోపంబు గదుర గురుపదంబునకుఁ బాపినారము. కావున నప్పదవికిఁ బాత్రుండవు నీవె, యని పలికినఁ జౌరంగి చిత్తముత్తలంపడ స్వామీ, నీవలుగ నేనెంతటివాఁడను. భవదీయ పాదపద్మముల సేవను నాతప్పు లన్నింటి నొప్పులుగఁ గావించి నన్నుఁ గారుణ్యమున మన్నింపుమని వేఁడుకొనెను. అన్నియు విని దానికి గురునాథుఁ డీయకొనక వినయవిశేషభూషితుండయి కేలుగవ మొగిచియున్న గోరక్షు నున్నతంబైన యోగసామ్రాజ్యమునకు మొదలఁ బట్టము గట్టి మదనారి తన కొసంగిన మహిమ లన్నియు నాతనికిఁ బ్రసాదించి ధన్యునిం గావించెను.

### సర్పరూపుఁడగు గంధర్వుని కథ

అప్పుడు చౌరంగి హస్తోత్కర్షంబున హస్తమ్ములు మొగిచి గురునాథ, యానాఁడు కుంభీనసంబు వల్కిన విధమ్ము మీకు విన్నవించితిని. అందు విచ్చేయ మనసు కలదేనిఁ జనుటొప్పు ననుడు ఫలంబొసంగు పనిని దలంపునకుఁ దెచ్చి మేలు కావించితి వని యగ్గించి గురునాథుఁడు గుహాద్వారమునఁ జాటుగఁ గల్పించిన త్రోవను జౌరంగి ముందు నడువ నేఁగి యేఁగి కబంధ రత్నాకరంబను మడువును జేరఁజని యందు

నిర్మలజలంబున ముఖపద్మంబు కడిగి చల్లని సైకత వేదిక స్థలిలోఁ గూరుచున్న సమయమ్మున గురుస్వామి కెఱిఁగి భుజంగంబు నాఁడు డప్పివడి గదిసి యచ్చటికి వచ్చిన జాడయుఁ జెప్పి దానిమూలమ్మున మహీరుహము సమూల ముగఁ బెకలి తోయముల మునిఁగి క్రమ్మఱఁ దేలి మున్నున్న యట్టి తెన్నున నున్నదానిని జూపి వర్ణించుచుండెను. అంతఁ బడగలు విచ్చి వెలికి లోనికిఁ జాఁచు నాలుకల నోయ్యన విషాగ్నిధూమములు పొలయ హుంకారములు పొరయ నిడుదవాలమున మెఱయు పొడలు నదరులు చెదరి యురులు కన్నులును గెంజిగి మించు కమనీయ కంఠములును బడగల మీఁద వెలయు కట్టాణి ముత్తెములును వింతకాంతు లీను చుండ ఘుర్ఘురధ్వాన మొనర్చుచు నురగేంద్రుం డల్లన వచ్చి యమ్మడుఁగు డాసి నిర్మల నీరమును గడుపారఁ గ్రోలి మొగము నిక్కించి యా క్రేవఁ గూర్చుచున్న యిరువురిలోఁ జౌరంగిని గుఱుతించి చయ్యన నేఁగి మున్ను తాను సమకూ ర్చిన భవ్యప్రభావ సంపన్నములగు దివ్యౌషధము లన్నింటిని దెచ్చి సద్భక్తి వెలయఁ గానుక లిచ్చి మీననాథుని చరణము లకుఁ బ్రణతుండై, త్రిలోక పూజిత సచ్చరిత్ర, పరమ దయా విధేయ దురితదూర శుభాకార పరమేశపుత్త్రి భవలతా లవిత్ర నీ మహత్త్వము మున్ను వినియు నధిక తేజఃస్ఫూర్తిఁ బొలయు నీమూర్తి కనియుఁ గన్నులు గల ఫల మందిన నాదు జన్మము ధన్య మయ్యెను. ఘోరతర శాపబాధయు ననుఁ బాసెను. అంచు నప్పుడు సర్పాకృతి విడనాడి చయ్యన

గంధర్వరూపము దాల్చి యుత్సాహము కందళింప వినయమునఁ దన వృత్తాంత మెల్ల నిట్లని విన్నవించెను:-

అయ్యా, యమ రేశ్వరుని సన్నిధి నంది కుండలికనామమునఁ బరఁగు గంధర్వుఁడను నేను. తొల్లి ద్వాపరమ్మున పాండవవంశమ్ములోఁ బరీక్షిత్తను భూవిభుఁడు వేఁటకై యడవికి నేఁగి తీవ్రతపశ్చరణఁ జేసి మౌనము వూనియున్న శమీకునిగాంచి మాటాడఁడని రోసి యాతనికుత్తుకను బాఁప పీనుఁగువైచి చెచ్చెర నింటికిఁ బోయెను. అమ్మునిపుంగవుని శిష్యుఁడు ప్రళయ కాలాగ్ని కల్పుఁడు శృంగి యనువాఁ డచ్చోటికి వచ్చి యా పాపపీనుఁగుఁ గాంచి నిశ్చలచిత్తమునఁ దపంబున మునిఁగిన మునివరుని జూచి యెవ్వఁడిది వైచెనో యని కోపం బగ్గలింప నా నీచుఁడు నేఁటికి నేడవనాఁడు తక్షక విషానలంపు దారుణ శిఖలలో భస్మీభూతమై పోవుఁ గాక యని ఘోరశాప మొసంగెను. పదపడి శమీకముని శిష్యు లవ్వార్త పరీక్షిత్తున కెఱింగింప నాతఁడు నెంతయు నడలి ప్రాణభయమ్మున నొక్క యెడ నొంటి కంబము మేడలోఁ బదిలముగా మెలఁగుచుండెను.

అంతటఁ దక్షకుఁడు ఱేనిం జంపుటకయి భూసుర వేషము దాలిచి యరుదెంచుచు నొక్కచోటఁ ద్రోవను విలసిల్లు వటవృక్షంబు నీడలో సేద దీఱ శయనించెను. అట్టి యెడరునుండి ఱేనిని దొలంగించి తప్పక బ్రతికింతు నంచు ధన్వంతరియుఁ దలంచి వేగమె వచ్చి యచ్చోటఁ జెట్టు నీడను విశ్రమించిన తక్షకుని వీక్షించెను. నీవెవ్వఁడవు. ఏల వచ్చితి విచ్చటికి. అని తక్షకుం డడుగ నాపేరు ధన్వంతరి,

తక్షకునివలనఁ బరీక్షిత్తు చావకుండ సంజీవశక్తి నూపి యాతనిఁ గావను బోవుచున్నా నని యతఁడు పలికెను. ఆ తక్షకుండను నేనె. ఎట్టులా క్షితిపతిని రక్షింపఁ బూనెదవో! ఇదిగో! ఈ మఱ్ఱిని నా విషపూర్ణ దంష్ట్రలచేఁ గఱచి భస్మము చేసెదను. చూడు నా దెబ్బ! దీనిని మున్నున్న యట్టులు చేయనేర్తువో చూతము గాక. అంచు నేచి యచ్చెరువు బెరయునటులు నిజాకార మేర్పడఁ బెరిఁగి విలయ కాలానల జ్వాలలు విడంబించు విషజ్వాలలు వెడలఁ గ్రక్కుచు నోడిసి మఱ్ఱిని గఱచిన గొబ్బున నయ్యది విషాగ్ని పటలంబుచే భగభగ మండి కాలి నేలఁ బడెను. అంతట ధన్వంతరి యా భస్మముదరిఁ జేరి సంజీవని మంత్రముల నీరము మంత్రించి చల్లెను. తోడ్తో నా వటభూరుహ మాకుజొంపముల పసిఁడాలు నిగనిగలు వెలార్ప రెమ్మలు కొమ్మలు నింపు సొంపెసఁగ నిండారఁ బండి యింద్రగోపముల నీసడించు బండ్లకొలంది పండ్లు కన్నుల పండువు సేయఁ దూఁగు శాఖోపశాఖలలో నూయల లూఁగు శకుంత సంతానము లోక వింత చెలువు కూర్ప ముచ్చట నిచ్చుచు నుప్పరం బెగసి పన్నుగ మున్నున్న పాదునఁ బన పడి పరిఢవిల్లుచుండెను. దానిం గనుగొని తక్షకుఁ డచ్చెరువున మనమ్ము ఱ్రాపడి నిలిచి మహాత్మా, నీ దివ్యమంత్రంబు మహత్త్వ యియత్త యని వర్ణింపఁ జాలను. మునిశాప దగ్ధుండగు నాతేఁడు నీకొసఁగు నర్థ మదియెల్ల నేనిత్తును. మిన్నక పొమ్మని వేఁడికొని మితిలేని పెన్నిధిని బ్రియమారఁ జూపి యాస గొలిపెను. ధన్వంతరి యది యందుకొని ప్రియంబంది

యెండే నరిగెను. అంత నేను, దరువుతో పాటు దగ్ధమైన పరితాపమునఁ జేసి యురగంబులు పాపజీవులంచు వారియోడక దూషించితిని. తక్షకుఁడు సూక్ష్మవీక్షణంబుల నను వీక్షించి మాతెఱంగెఱింగియు నిటులు దూఱనాడితివి గానఁ జెచ్చెర నీవిప్పుడు క్రూర భుజంగమవు కమ్మని శాపమ్మొసంగఁ దోడ్తో నురగరూప మెత్తిన యేను శాపమోక్షము నేరూపమునఁ బొందఁగల నని పొందికగా వేఁడుకొంటిని. ఆతఁడు దయ దలఁచి పరమేశ్వర నందనుండగు మీననాథునిఁ గాంచి భాషింపఁ గలుగు నాఁడు శాపమోక్షము కాంతువని పలికి చనియెను. నాఁటఁగోలె నీ సందర్శనమ్ము నెమ్మనమ్మునఁ దలఁపోయుచు నీమడుఁగులో నివ్వడువున నుండుదును. నా భాగ్యమున నీ విచ్చటికి విచ్చేసితివి. కనులార నిన్నుఁ గాంచఁ గలిగితిని. నీదు ప్రసాదమున నేఁడు క్రమ్మఱ నాకంబు కనుగొనఁ గంటిని. అని విన్నవించి గంధర్వుఁడు సమ్మదం బెసంగ వియద్వీథి కెగసి రివ్వునఁ జనియెను.

పదపడి మీననాథుండు గంధర్వుఁ డర్పించిన సారములగు నౌషధము లన్నియు గోరక్షుని చేతి కొసంగి యటనుండి యల్లంతఁ గదల నా పొంత నొకవింతగాఁ జొక్కంపు మొల్లవిరులు తురిమిన కొప్పున సింగారము లొప్ప బెడఁగుగాఁ దీర్చిన జేగురు పెడవంక బొట్టు వెట్టి చెక్కుల వెన్నెలలు చల్లు దంతపుఁ గమ్మలు తళతళమని మెఱయఁ గొనగోట మీటిన విచ్చు చనుగుబ్బలమీఁద వ్రాలు గురువింద పూసల సరము చిందులు ద్రొక్క నెమిలిపురి వన్నెచిన్నెల వెలయు పచ్చని పుట్టంబు దాల్చి చంకను బరువగు పండ్లబుట్టను

బూని యొకకేల రాచిలుకల గూడు పట్టి వచ్చి కస్తూరితో మెదపి మేనిపూఁతగా నొదవిన భద్రదేభమదము ఘర్మాంబుకణములు కలసి వింత సువాసన గుబాళింప వాలుగమీల తళుకులను మించి తలచుట్టి పాలు నిడువాలు గన్నుల నిగ్గులు వాలయు వలపు పిసాళించు వనిత యొక్కర్తు తనపజ్జ నేతేర నెక్కువెట్టిన వింటిని జేఁబూని చిక్కువెంట్రుకలు కొప్పుగాఁ గట్టి గోరోజనము బొట్టు పెట్టి పారుటాకుల కాసె చుట్టి గురువెందపేరు దాల్చి తీరుతియ్యము లాసంగు వేసమునఁ జెన్నారు పుళిందుఁ డొక్కరుఁడు వచ్చి యమ్మడువున వారిపూరంబు వలయునంత చెచ్చెరఁ గ్రోలి యా చేరువ రసాలవృక్షము నీడఁ దరుణియుఁ దాను మోదమున నుండి కేలఁకేలఁ గలయు వీక్షించి బాలార్క తేజుని మీననాథునిఁ బొడఁ గాంచెను. కాంచి హర్షోత్కర్షమ్మున నీ మహామహుఁడు భూతేశుఁడేని పాముల తొడవులు ఫాలలోచనము పులితోలు కప్పు పునుక కంచము చంద్రకళయుఁ గలిగితీరును. మదనారి కుమారుఁడైన వెలయు ఘనుఁడు మత్స్యేంద్రుఁడే యీతఁడు కావలయు నంచు నెంచి ముదమునఁ గొంకుచు వచ్చి గోరక్షుని చేత నిక్కువం బెఱిఁగి తరుణియుఁ దాను దండప్రణామంబు లాచరించి యారముగ్గిన పండ్లను గానిక పెట్టి యిట్లని విన్నవించెను. స్వామీ, నేనొక చెంచువాఁడను. నిచ్చలు వేడ్కతో నీ కొండకోనల వేఁటాడుచు నొక్కొక్క చోటఁ గాంచిన చిత్రములు మిక్కిలియుఁ గలవు. ఇవియని యవియని వేలువేలుగ వివరింప నేరను. ఇత్తెఱంగు దేవర కెఱింగింప వేడుకపడియుండ దైవయోగమున మీరె యిటకు

విచ్చేసితిరి. వినుఁడు నా మనవి. ఒక్కచో నొక జాతిమీఁద దివానిశము తేజ మొండు వెలుఁగొందును. డాయఁబోయి నిలిచినఁ బసిఁడి వన్నెయుఁ దోఁచును. అది మంటయుఁగాదు. అదెట్టిదో యనిన యోగియరుదెంచి యచ్చోట నారసంబున్న దంచు నా కందువ యెఱింగింప నాతనిఁ దోకొని చని యచ్చట నట్లే యుంట యారసి శిష్యుల కదియెల్లఁ జూపి ముదమునఁ బొదలుచుఁ బోయిపోయి కొండమీఁద నొక్కయెడఁ గూరుచుండి శంకరుని భక్తితోఁ దలఁచి యా రసదేవత నర్థితోఁ బ్రార్థించి కేలు మొగిడ్చి యుండెను. అంతఁ గ్రక్కున నా శిలనుండి మెఱుఁగులు గ్రక్కుచు నింగి నిండార వెడలి మహాదేవు తేజంబు వజ్రకరండంబుతోడఁ దేజరిల్లుచుఁ జెచ్చెర వచ్చి యాతని దోసిటఁ దోఁచెను. అల్లన నద్దానిఁ గేలుఁగవఁ బొదివి యత్యంత భక్తిని శిరంబునఁ జేర్చి ముదంబు గదుర గోరక్షునిచేతఁ బెట్టి పుళిందుని నుతియింప నాతఁడును జిత్త మేపార స్వామీ, మఱొక్కయెడ మహాభూతంబు నొక్కటిఁ బొడగంటిని. ఆకథ వినుండు. ఒక్కచో నేకలం బొక్కటి యుద్ధృతముగ నామీఁదఁ గదిసి తారసిల్లిన వాఁడియమ్ము దొడిగి యేసిన నయ్యది తప్పఁదొలంగి ఖంగున నొకజాతిమీఁదఁ బడి మేలుబంగార మాయె. అది గాంచి వేడుకపడి నప్పట్టున నున్న జాలతో నా యమ్ములన్నియు మోపి చూడ నొక్కటియుఁ బసిఁడి కాదయ్యెను. అని విన్నవింప నయ్యది పరుసవేది యని పలికి పదమూ చూతమని వారితో నయ్యెడ కరిగి మత్స్యేంద్రుఁ డచ్చటి జాల నన్నిటిని బాయఁ ద్రోచి

తరుణార్క మండలముఁబోలి ధగధగ ద్యుతులఁ బొలుపారు ఘన శిలాముఖము నొక్కటి ప్రేమారఁ గాంచి పద్మాసనాసీనుఁడయి శంకరుని దలంచి చేతులొగ్గి మ్రొక్కెను. అప్పుడు వెలుఁగులు కలయఁ బర్వ దోసిటఁ బడిన నయ్యది పరుసవేది యని పలికి భక్తిప్రపత్తులు జొత్తిల్ల నొడలఁ బొదివి పదిలింపుమా దీని నని గోరక్షున కిచ్చెను.

పిదపఁ బుళిందుఁడా మత్స్యేంద్రునకు మ్రొక్కి దేవ యింకొక్క చిత్రంబు గంటిని. ఈ కొండలో నొక్కెడ వజ్రాల కాంతులు వెలయు శృంగం బొక్కటి కానగును. అచ్చోటఁ జేరి యే పదార్థములను దలంచిన నయ్యవి యెల్ల నచ్చెరువార వచ్చును. కాని యనుభవంబునకు రావు. కారణ మేమొకో యని విన్నవింప నయ్యది చింతామణిస్థానము. ఆ మణి చేతి కబ్బినఁగాని ప్రసిద్ధములైన సిద్ధులు సిద్ధింప నేరవు. అంచు నా సిద్ధనాథుఁ డెఱుకు చూపిన త్రోవను గుఱుతుగాఁ బోయి దీధితులు మెఱయు నొక్కయెడఁ జేరి మిక్కిలి భక్తితో ముక్కంటి నెంచి యగ్గింప మెఱుపుగములు పొరయుచు రాణించు చింతామణి హస్తపుటంబున నిలిచి యచ్చెరువు పొనర్ప మస్తకంబునఁ జేర్చి యెంతయు మన్నించి గోరక్షుని చేతికిఁ గ్రమ్మఱ నొసంగెను.

అంత గురువునకు నభివందనం బొనర్చి చేతులు మోడ్చి స్వామీ, యీ మహిమ యెఱుకువాని కేరీతి నెఱుక యయ్యె నానతీయవే యని చౌరంగి గోరక్షులు విన్నవించిరి. దివ్యదృష్టిచే నాతని తెఱం గెఱింగిన మీననాథుఁ డిట్లని పలికెను. 'మున్ను గాండీవి తపంబున నున్నవేళఁ బార్వతీవర

మేశులు కరుణించి వరంబు లీఁదలంచి చెంచు వేషములు వూని యచ్చోటికి విచ్చేసిరి. త్రోవలో నొక్కెడ నొక్కపక్కణమ్మున గోనముల కిక్కయగు నొక్క యెఱుకు వారిని దోడ్కొని పోయి ఫలమూలంబుల నారగింప నిచ్చి యమృతంబును బోలు చల్లని నీరొసంగి చిత్తమ్ము చిగురొత్తఁ బ్రియం బొనర్చెను. ఆ దంపతు లితని చెయిదములకు మెచ్చుకొని కిరాత జాతుఁడయ్యు నీతఁ డంత సౌజన్య మొప్పఁ జాలఁగా సపర్య లొనర్చుటఁజేసి సత్పాత్రు నీతని కీయవలయు నని యెంచి యోయీ, నీకు మహాబలాధికుం డయి తేజస్వి యగు సుతుం డొకండు కలుగు నని పలికిరి. అది విని యాతఁ డానందించి యీ పుట్టువున నొక్క పట్టి కలిగియే యున్నాఁడు గావున రాఁబోవు జన్మములో నట్టిపట్టిని దయసేయుఁ డంచు భక్తితో మ్రొక్కిన వారును వల్లెయంచు నాశీర్వదించి స్వేచ్ఛమెయిఁ జనిరి. అంతఁ గాలవశంబున నాతఁడు వాని యింతియు నీ యుగంబునఁ బుట్టి యీ యనఘునిఁ గాంచిరి. ఈతఁడు నిధానదర్శ నాముఁ డగుట నేతద్విషయమ్ములు దర్శింపఁ జాలెను. అని వివరించి మత్స్యేంద్రుఁ డా కిరాతున కభిమతార్థంబు లొసంగి శిష్యులతోఁ దా నుత్తరదిశకుఁ జెచ్చెరఁ జనుచుండ ముందటఁ బోవు చౌరంగి యొక్క మహీజమునీడఁ గొంత తడవు కానరాక యా నీడ గడవ నావలఁ గానవచ్చుటయు మత్స్యేంద్రు వెనుక నడచు గోరక్షుఁ డద్దానికి వెఱఁగంది స్వామీ, యీ చిత్ర మేమియో యెఱింగింప వలయు నని వేఁడుకొనెను.

## మేఘనాథ సిద్ధుని కథ

భూసురుం డొక్కరుండు పుత్త్రుండు పొలఁతియుఁ గూడి యొక్కయెడఁ గొలనిలోఁ బానీయములు త్రావఁ గోరి డిగ్గుచునుండ వాలుమెకం బొండు పెలుచ గర్జించుచుఁ బెటపెటమని వచ్చి యాతనిపై నుద్వృత్తిగ నుఱికి కుత్తుకనుబట్టి వాఁడి కోఱలఁ గఱచిన నెత్తురు దొరఁగి హా మహాదేవ యంచు నేల కాతఁడు వ్రాలెను. అంత మగని యార్తనినాద మా బ్రాహ్మణి విని పెనుభీతిని బఱచుచుండ నాపెను జంపను వెంటఁ దఱుము నా పులి నొక్కఱేఁడు చెట్టుచాటునఁ బొంచి కాంచి దిగ్గన నమ్ము దొడిగి యిమ్ముగ విల్లు చేఁబూని కడువడి నేయుటయు నయ్యది యద్భుతముగ దానిం దాఁకి నాటిన మూటఁ గట్టిన వడువున నప్పులి యుప్పరం బెగసి గుప్పున నేలఁ గూలి యీల్గెను. చయ్యెడ నా ఱేఁ డచ్చటికి వచ్చి యా పాఱుని యాలుబిడ్డల యుల్లం బూఱడిల్లఁ జేసి వారిం దోడ్కొని విప్రుని మ్రోలకుఁ దెచ్చి నిలిపి యాతని నోటఁ దియ్యని నీరు పోసి కన్నుగవ తడిపి యలతఁ దేర్చిన విప్రుం డల్లనఁ గన్ను దెఱచి దారపుత్త్రుల నారసి యా ఱేనిం గాంచి మీరెవ్వరయ్య యనెను. అయ్యా, నేనొక రాజకుమారుఁడను. కొలనిలో నీరు గ్రోలను దిగఁ బోయి యే నొక పులి నియ్యెడఁ బొడగాంచి యేయఁబూని యున్నంత నీవు నీపుత్త్రుఁడు నీ కళత్రము పులి కెదురయితిరి. అంతలో వాఁడియమ్మున నేసి యాపులిని నేలఁ గూల్చితిని. నీవంటి పుణ్యాత్మున కిట్టి చావయ్యెనే పాప మంచుఁ బరితపించు నా ఱేనిఁ గాంచి యనఘా, చావులు వేల్పులకైన లేవన

రాదు. దీనికి నే నడలను. కాని వాలుమెకము మూలమున నిట్టి చచ్చిన చావగుటకు మాత్రము మదిలో వగచెదను. అంచు నా విప్రుండు తన్నుఁ గాంచి యేడ్చుచున్న తనయుని జూచి డాయం బిలిచి తన్ముఖాంబుజము ముద్దుగొని నెమ్మిగఁ జేర్చి, యన్నా నామాట వినుము. నిచ్చలు నా యొనర్చు నాచారవిధు లెల్లఁ జక్కఁగాఁ బూని యెల్లవేళల జరుపుము. అలయక వేదశాస్త్రాదుల ననుదినము నభ్యసింపుము. నిత్యము సజ్జనగోష్ఠిని బాయక రాణింపుము. అతిథి సపర్య లేనాఁడును మానక మన్నింపుము. సర్వదా భూతదయ నేమఱక మెలంగుచుండుము. ప్రతిపదము పరమేశ్వరుని భక్తసులభుని జిన్మయాత్మునిఁ జిత్తమున హత్తుకొనఁ గీలు కొల్పుము. అని బుద్ధులు సెప్పి యిల్లాలు కేలు తన కేల సమర్చి బిడ్డను జూపి, వనితా యీతఁడు కడుఁ బసివాఁడు. ఏమియు నెఱుఁగఁడు. పట్టి బేల. ఈ కాఱడవిని గ్రూరమృగ ముల సందడి మెండు. ఎవ్వడను నొంటిఁ బోనీయకుము. ఇఁక మీఁద మీకు నిందుండఁగా వలవదు. మునీశ్వరాశ్ర మమ్మున వసింపవలయును. కరణీయమ్ములు కావించుచుఁ గులశీలము లేమఱక మెలఁగుచుండు మని వెండియు జేనిం గనుగొని బాబూ, యీ యిర్వురను వాలుమెకంబు బారికిం బాపి కాపాడితివి. సుకృతాత్ముఁడవు. కరుణామై వీరి నింక నొక్క మున్యాశ్రమము చేర్పుము. సకల యోగ ములకన్న మిన్నయయి సారభూతమగు ఫలము నీకొదవు నని మూఁవురకుఁ జెప్పి పార్వతీపతిని మదిలోఁ బాదుకొలిపి నమశ్శివాయ యంచుఁ బ్రాణంబులు విడచెను,